# అంటరాని ప్రేమ

కలేకూరి ప్రసాద్
కవిత్వం





కలేకూరి ప్రసాద్
(అలియాస్ కోటేశు, సంఘమిత్ర, యువక, కవన)
ప్రసిద్ధ కవి, అనువాదకుడు, పాత్రికేయుడు; సామాజిక, రాజకీయ కార్యకర్త. స్వస్థలం కృష్ణాజిల్లా కంచికచర్ల. జననం 1962 అక్టోబర్ 25. తల్లిదండ్రులు లలిత సరోజిని, శ్రీనివాసరావు. ఇద్దరూ ఉపాధ్యాయులు. అయిదుగురు సంతానంలో ప్రసాద్ రెండవ వాడు. కంచికచర్ల, ఏలూరు, గుంటూరులలో చదువుకున్నాడు. పద్దెనిమిదేళ్ళ వయసులో సాహిత్యం, విప్లవ రాజకీయాలను విద్యుల్లతలాగ అల్లుకొన్నాడు. కడవరకూ రచన, కార్యాచరణ అవిభక్త విలువలుగా జీవించాడు.

1984లో 'కంచికచర్ల కోటేశు' గురించిన పాటతో కవిత్వ రచన ఆరంభించాడు. 1986లో విప్లవ రచయితల సంఘంలో సభ్యుడిగా చేరాడు. అటుపిమ్మట 1991నుంచి దళిత, బహుజన సాహిత్యంతో మమేకమయ్యాడు. విప్లవ, దళిత సాహిత్యంలో పాఠ్యాంశాలుగా పరిగణింపదగిన పాటలు, కవితలు సృజించాడు. 'కర్మభూమిలో పూచిన ఓ పువ్వా' (1987), 'కుమిలి పోయినా నలిగిపోయినా చుండూరు గుండెలో గాయం' (1993) వంటి పలు

గీతాలతో ప్రజని ఉత్తేజితం చేశాడు. కారంచేడు ఒగ్గుకథ, మరికొన్ని కథలూ రాశాడు. తొలినాళ్ళ నుంచి దేశదేశాల ఇష్ట కవితల్ని తెలుగులోకి తెచ్చాడు. సాహిత్య, సామాజిక, రాజకీయాంశాల మీద వ్యాసాలు, సంపాదకీయాలు, పుస్తక సమీక్షలు ప్రకటించాడు. విశిష్ట రచనలనేకం అనువదించాడు. కొన్ని సినిమా పాటలు కూర్చాడు. ఏ ప్రక్రియని చేపట్టినా కవిత్వమయం చేశాడు.

రాడికల్ యూత్ లీగ్, దళిత మహాసభ, బహుజన సమాజ్ పార్టీలలో క్రియాశీలక సభ్యుడిగా పనిచేశాడు. 'ఆంధ్రభూమి' దినపత్రికలో కొంతకాలం ఉప సంపాదకుడిగా ఉద్యోగం చేశాడు. సాక్షి హ్యూమన్ రైట్స్ వాచ్ స్వచ్ఛంద సంస్థలో పనిచేశాడు. 'ఏకలవ్య', 'మహాబోధి', 'నిఘా', 'బహుజన కెరటాలు' తదితర పత్రికల నిర్వహణలో పాలుపంచుకొన్నాడు. ఇల్లు, కుటుంబం, సొంత ఆస్తి, కీర్తిప్రతిష్ఠలను గడ్డిపరకలుగా జమకట్టాడు. అతను ఒక్కడే ఓ సాయుధ దళం మల్లే మెసలేవాడు. ఆఖరికి తను ఆశ్రయం పొందిన చెట్టు నీడని వదిలి, 2013 మే 17 వడగాడ్పులో అర్థాంతరంగా అదృశ్యమయ్యాడు.

చిరకాల మిత్రుడు, ప్రియమైన కవి ప్రసాద్ స్వీయ, అనువాద కవితలతో మొదటిసారి సాధికారికంగా ఈ 'అంటరాని ప్రేమ' సంపుటం ప్రచురించాము. ఈ అసమ సమాజంలో తరతరంగా సాటి మనిషిపట్ల ఎడతెగని వివక్ష పర్యవసానంలోంచి, శతవిధాల అణచివేతల విపత్తుల్లోంచి పెల్లుబికిన కవిమాత్రుడి అసహ్యం, ఆవేశం, ఆవేదన ఈ కవిత్వంలో జీవన జ్వలనంగా అభివ్యక్తమవుతోంది. ఏకకాలంలో ఇది ఒక ఆందోళనకారుడి అనల్పమైన అంతశ్చేతన చిహ్నంగా పెళపెళ ఉరుముతోంది. *

– ప్రేమలేఖ ప్రచురణ

# అంటరాని ప్రేమ

కలేకూరి ప్రసాద్

కవిత్వం

సంపాదకుడు

నామాడి శ్రీధర్




2019



antaraani prema
poetry by
kalekuri prasad

editor
namadi sreedhar

first edition
march 2019

cover
ramanajeevi

kalekuri portrait & drawings
anwar

printed @
sri sri printers, vijayawada - 520 002
phone: 9490634849

copies @
namadi sreedhar
# 3-129, near high school,
ambajipeta, east godavari dt, ap.
pin: 533214 phone: 9396807070
email: namadisreedhar@gmail.com

and

aneka, vijayawada 9247253884
navodaya, hyderabad 9247471362

₹ 100

# దహనకేతనం

ఏ అడవిదారుల్లో పాటలు అల్లాడో, ఏ కొండకోనల ప్రజలకి పాఠాలు నేర్పాడో, ఎవరి తరతమభావంతో మనసు చివుక్కుమని వెనుదిరిగాడో, అతని లోపలా వెలుపలా ఎడతెగని పోరాటాలెన్ని చేశాడో కాని, కలేకూరి ప్రసాద్ 1996లో హైదరాబాద్‌లోని మమ్మల్ని వెతుకుతో వచ్చాడు. అప్పటికి మేము ఇంటిలో ఇమడలేక, బతుకుతెరువు ఉద్యోగంలో సమాధాన పడలేక, ఉద్యమంతో పరిపూర్తిగా తెంపుకోలేక సతమతమవుతున్నాం. బహుశా తను కూడ అదే సందిగ్ధస్థితిలో ఉన్నాడనుకొంటాను. అప్పుడప్పుడే వెలువడిన 'ఆకుపచ్చలోయ' కవిత్వ సంపుటంతో పరిచయం పెంచుకొన్నాడు. 'అతడూ ఆమె మేమూ' దీర్ఘకవితని గుండెకు హత్తుకొన్నాడు. మా బృందంలోని అందరికీ ఆవశ్యకమైన ఆప్తమిత్రుడయ్యాడు. ఆ తర్వాత మాకు తోడబుట్టిన వాడికంటే ఎక్కువయ్యాడు.

అవును, ఎంతటి కొత్తదనంతో రంజిల్లిన రోజులవి. బ్రతుకుని రొక్కం రూపంలోకి మార్చుకొనే విద్యలు అలవడని కాలమది. తస్సాదియ్యా అన్నీఇన్నీ కలలు కావు. ఆద్యంతం కాంతివంతం, మనోహరం. చేగువేరా అడుగుజాడల్ని అనుసరించే అపూర్వ ఆకాంక్షలవి. శివసాగర్ 'నల్లాటి సూరీడు' ఉదయించే అద్భుత క్షణాలవి. సాహిత్యం, సంగీతం, సినిమా, నాటకం, రంగులు, రేఖలు, ఏ పూటకాపూట పాటలే పాటలు. గద్దర్ మీద దాడికి నిరసన, చలపతి విజయవర్ధనం ఉరిశిక్ష రద్దు కోసం ఆందోళన, 'జిహాద్' పుస్తకావిష్కరణ పట్ల అభ్యంతరంతో జెండా చెట్టు సభ, తరమ్ ఆవిర్భావం. కేవలం ఘటనల వెంట కొట్టుకుపోవడం కాదు. ప్రతి సంక్షుభిత సామాజిక సందర్భంలోనూ రెక్కలు కట్టుకు వాలడమే.

చూస్తే, అప్పటి ప్రసాద్‌ని చూడాలి. ఎలాగ ఉండేవాడనుకొన్నారు? మనకాలం వీరుడి తీరున ఉండేవాడు. సదా అశాంతితో

ఉన్నట్టుండి పిడికిలి బిగిస్తుండేవాడు. వింటే, ఆనాటి మాటలు వినాలి. ఏమి మాట్లాడేవాడనుకొన్నారు? నిలువెల్లా ఓ ధిక్కార గొంతుకతో నినదించేవాడు. అర్ధరాత్రి అతిథిలాగ వచ్చేవాడు. ఓ చేతిలో సిగరెట్, మరొక చేత పుస్తకం. సున్నిత హృదయం, సునిశిత మేధ, కట్టుబట్టలు మినహా మరేమీ లేనివాడు, అక్కరలేనివాడు. విస్తృత అధ్యయనం, నిరంతర మథనం. అంతే, ఒక బాలుడివలె నేలమీద కూర్చుని సునాయాసంగా రాసుకుపోయేవాడు. ఒక్కోసారి రాతప్రతుల్ని అక్కడివక్కడే వదిలిపోయేవాడు. ఎక్కడెక్కడో నిలకడ లేని పచార్లు చేసేవాడు. మళ్ళీ ఎప్పుడో హఠాత్తుగా ప్రత్యక్షమయ్యేవాడు. ఏభయ్యేళ్ళ తన జీవితకాలంలో మూడు దశాబ్దాల ఉద్యమపథంలో కంచికచర్ల నుంచి లక్షింపేట వరకు, నక్సల్బరి నుంచి అస్తిత్వవాద ఉద్యమాల వరకు, ఎస్సీ వర్గీకరణ నుంచి ప్రత్యేక తెలంగాణ నినాదం వరకు, బాబ్రీ మసీదు నుంచి డర్బన్ సదస్సులో ఫిడెల్ కాస్ట్రో సమక్షం వరకు ప్రకాశవంతమైన ప్రయాణం చేశాడు. అదే సమయంలో రచన వ్యాసంగమూ కొనసాగించాడు.

సరే, మేము ఎగరవేసిన భావికాలపు ఊహల రెక్కలు తెగిపోగా, ఒక్కొక్కరం నలుదిక్కులకీ చెల్లాచెదురై పోయాం. అటుపిమ్మట ఒకదాని వెంట ఒక ఆటంకం, అవరోధం. ఆ ఛిన్నాభిన్నపు కాలంలో ఎప్పుడైనా తారసపడినా, ఫోన్‌లో పలకరించుకొన్నా అవన్నీ మొక్కుబడి సమావేశాలు, ముక్తసరి సంభాషణలే. మా ఇంటికొచ్చి కొన్నాళ్ళు ఉండమన్నాను. ఇదిగో వస్తానన్నాడు కాని రాలేదు. పోనీ నన్ను తన దగ్గరికీ రానివ్వలేదు. బహుశా, నాలో ముద్రపడిన ధీరయువక రూపం చెక్కు చెదరకూడదను కొన్నాడు. ఒకనాడు ప్రసాద్ అలక్ష్యం చేసిన రాతప్రతులతో పాటు, 'వార్త' సాహిత్యం పేజీ 'సృష్టి'లో నేను ప్రచురించినవి, ఆదివారం సంచికలో అచ్చయినవి, ఇతర పత్రికల నుంచి సేకరించినవీ అనేక రచనల్ని అతనికి అందజేశాను. అవన్నీ చేతుల్లోకి తీసుకొన్నప్పటి ఆశ్చర్యానందాలను తన చివరి రోజుల లోగొంతుకలో వినగలిగాను. మా స్నేహంలో ప్రసాద్‌ని నేనేమి కోరాను? అతని కవిత్వం పుస్తకంగా ప్రచురిస్తానని మాత్రమే. అమాయకమైన నవ్వుతో తను చనిపోయిన

తర్వాత అచ్చువేయమన్నాడు. అంతరంగంలో ఆరని దుఃఖాగ్నితో ఇష్టపూర్వకంగానే రోజుకొకింత హరించిపోయాడు. ఈ పూర్వరంగంలో కవితల సేకరణ ప్రారంభించాను.

* * *

నువ్వు ఎంత ఎత్తులో నిలబడితే అంత దూరం నీకు కనిపిస్తుం దంటారు. మరి, తన స్వగ్రామం కంచికచర్లలో కోటేశు సజీవ దహన కాండ అనే అమానుషపు పర్వత శిఖరాగ్రం మీంచి ప్రసాద్ ఈ సమాజపు గతిని పరికించాడు. అప్పటికి అతను అయిదేళ్ళ పిల్లవాడు. దళితుడైన కోటేశు (ఆరుకట్ల కోటేశ్వరరావు)ని దొంగతనం చేశాడనే ఆరోపణతో ఆధిపత్య కులస్తులు హతమార్చిన సంఘటన (1968 ఫిబ్రవరి 24) మన వర్ణ, వర్గ వ్యవస్థలోని హింసాత్మక విశ్వరూపాన్ని ఆ లేత కళ్ళకు కట్టినట్టయింది. పెను విషాదం పసి హృదయాన్ని విడవని జ్వరం వలె పట్టుకొంది. అహర్నిశం విస్మృతం కాని నల్ల సీతాకోకచిలుక మాదిరి రెక్కలు కొట్టుకొంది. అందుకనే వెలివాడ ఆంతరిక ప్రేరణనుంచి కాల గమనంలో అతనొక కవిగా; సామాజిక, రాజకీయ కార్యకర్తగా పుట్టుకొచ్చాడు.

ఆనాడు దిగంబర కవులు తమ మూడవ కవిత్వ సంపుటం (1968) కోటేశుకే అంకితమిచ్చారు. *'ఈ దేశంలో/ ఈ ఇరవయ్యేళ్ళ స్వాతంత్ర్యంలో/భయంకరంగా విజృంభించిన/కులమత దురహం కారానికి/ధనమదంతో యథేచ్ఛగా/ ప్రజాస్వామ్యాన్ని వాడుకుంటున్న గూండాయిజానికి,/ సినిమా రొంపిలో ఈదులాడుతూన్న/యువతరం బలహీనతకి,/స్తోత్ర పాఠాల కుడితిలో పడిపోయిన/పత్రికాలోకం పడుపు జీవనానికి,/అతీత జీవనంతో తప్పించుకు బతుకుతున్న/మేధావుల అనాసక్తతకి,/ నాయకుల ఊసరవెల్లి ఆదర్శాలకి, పదవీ వ్యాపారాలకి/ నేటి ఈ 'కుష్ఠు వ్యవస్థ'కి క్రూరంగా బలైన 'కంచికచర్ల' కోటేశు స్మృతిలో'* అని వారు పేర్కొన్నారు. ఆ కులోన్మాదపు ఘటన ఈ దేశంలో మొదటిది కాదు చిట్టచివరిది అంతకంటే కాదు. కిలవేన్మణి, కారంచేడు, నీరుకొండ, చుండూరు, లక్షింపేటలనేకమే తప్ప ఈనాటికీ అంతూ దరీ లేదు.

కనుకనే ప్రసాద్ సృజనలో ఆద్యంతం దళిత, బహుజనుల దీనరోదన, ఆగ్రహప్రకటనలని అభివ్యక్తీకరించాడు. విప్లవ, దళితోద్యమాల ప్రవాహపు ఉరవడిలో పడి కొన్నేళ్ళపాటు కొట్టుకుపోయాడు. నీళ్ళింకిన రాళ్ళమయ కాలం ఒడ్డున ప్రేక్షకుడిగానే మిగిలిపోయాడు.

* * *

ప్రసాద్ తొలినాటి కవిత 'మేం అరుస్తూనే వుంటాం' అరుణతార, 1987 ఏప్రిల్, మే సంచికలో 'కోటేశు' కలం పేరుతో అచ్చయింది. దీనిలో కవి తమ ఎట్టి,మట్టి బ్రతుకుల మీద అగ్గయి కురవమని సూర్యుడిని అభ్యర్థిస్తాడు. ఈ కవితలో తొలిసారి కారంచేడుని ప్రస్తావించాడు. 1987 చివరికి అతను 'యువక' నామధేయుడయ్యాడు. అప్పటికి విరసంలో సభ్యత్వం తీసుకొన్నాడు. కాబట్టి అదే ప్రాపంచిక దృక్పథంతో కొన్ని కవితలు రాశాడు. 1991లో యువక, నవత సంయుక్తంగా 'భ్రమల వ(వి)లయం' రాశారు. మండల్ కమిషన్ వ్యతిరేక ఆందోళనలో ప్రతిభ, రిజర్వేషన్ల మధ్య వివాదాన్ని ఉద్దేశించి 'ప్రతిభా! నీ అసలు పేరు అసమానత్వం' అన్నారు. ఆ తర్వాత సొంత పేరుతో రాసిన 'పిడికెడు ఆత్మగౌరవం కోసం' (అరుణతార, 1991 సెప్టెంబర్) దళిత జీవితానుభవపు కొలిమిలో పదునుదేరిన తళత్తళ కవితగా రూపుదిద్దుకొంది.

"త్రేతాయుగంలో నేను శంభూకుణ్ణి
ఇరవై రెండేళ్ళ క్రితం నా పేరు కంచికచర్ల కోటేశు
నా జన్మస్థలం కిలవేన్మణి, కారంచేడు, నీరుకొండ
ఇప్పుడు కరుడుకట్టిన భూస్వామ్య క్రౌర్యం
నా గుండెల మీద నాగేటి కర్రులతో పచ్చబొడిసిన పేరు చుండూరు
ఇక చుండూరు నామవాచకం కాదు సర్వనామం
ఇప్పుడు ప్రతి గుండే ఒక చుండూరు, రగిలే రాచపుండూరు

నేను జన సమూహాల గాయాన్ని గాయాల సమూహాన్ని
తరతరాలుగా స్వతంత్రదేశంలో అస్వతంత్రుణ్ణి

అవమానాలకూ, అత్యాచారాలకూ,

మానభంగాలకూ, చిత్రహింసలకు గురై

పిడికెడు ఆత్మగౌరవం కోసం తలెత్తిన వాణ్ణి

ధనమదాంధ కులోన్మత్తుల రాజ్యంలో

బతకడమే ఒక నిరసనగా బతుకుతున్న వాణ్ణి

బతికేందుకు పదే పదే చస్తున్నవాణ్ణి

నన్ను బాధితుడని పిలువకండి

నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి!"

అని ముక్తకంఠంతో చాటింపు వేశాడు. ప్రతి సభలో తన ప్రసంగానికి నాందీగీతం మల్లే ఈ కవితని ప్రసాద్ నోరారా వినిపించేవాడు. ముమ్మాటికీ ఇది ఈ నేల మీద దళితుల 'ఆత్మ కవిత' అంటాను.

* * *

తొలినాళ్ళ నుంచి అతని కవిత్వం గాఢతని గడించుకొంది. 1990వ దశకంలో ఉత్తమోత్తమ కవిత్వం సృజించాడు. ఆ దశలోనే కవిగా గొప్ప వికాసంతో వెలుగొందాడు. 'అంటరాని ప్రేమ', 'సొరాజ్జెం', '18 డిసెంబర్ 1996', 'విలాస్ గోగ్రే' వంటి రచనల్లోని సంవేదన, 'బహుశా మనది ఒక దేశం'లోని ఆర్ద్రత, 'హృదయ చాలనమ్'లోని అంతర్ముఖత, 'నువ్వే నేను/తెలం'గానం'లోని స్పష్టత, 'కోబలి'లోని కోపోద్రిక్తత, 'అవిశ్వాసం'లోని అధిక్షేపం, 'బాబా! అంబేద్కరా' మొదలుకొని 'ముఖచిత్రం' వరకు డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ ఎడల ప్రాణప్రదమైన భావనతో వెరసి తెలుగు కవిత్వంలో 'మంటల మానవుడి' మల్లే రగులుకొన్నాడు. దళిత కవిత్వంలో రీతివైవిధ్యం చూపాడు. భాషాపరంగా మహా జాగరూకతతో ఉన్నాడు. పదాలను తూర్పార బట్టాడు. మిలమిలమనే పరిభాషను ఏర్పరచుకొన్నాడు. అక్కడక్కడా బైబిల్ వాక్యాల్ని విమర్శనాత్మకంగా జోడించాడు. ఇక మార్గాంతరం లేక పిస్తోలును లోడ్ చేసినంత వడివడిగా కవితని నిర్మించుకొచ్చాడు. విశిష్టమైన సృజనాత్మకశక్తితో 'హిందూ సామ్రాజ్యవాదం' మీదికి సాటిలేని గురికాడిగా నిలిచాడు.

స్వతంత్ర రచనతో పాటు ఏకకాలాన అనుసృజనలో కూడ కృషి చేశాడు. 1997నుంచి 2009 మధ్య హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ప్రజాశక్తి బుక్‌హౌస్ కోసం విరివిగా అనువదించాడు. (ప్రసాద్ స్వతంత్ర, అనువాద పుస్తకాల జాబితాని ఆఖరి పుటల్లో జతచేశాను). వివిధ భాషల మేలిమి కవితలు కొన్ని తర్జుమా చేశాడు. ప్రధానంగా విరసం కాలంలో బెంగాలీ, రష్యన్ కవితల్ని, దళితోద్యమంలో మరాఠీ దళిత కవుల్ని తెలుగులోకి తెచ్చాడు. దేశదేశాల విప్లవ కవులు, దళితపాంథర్స్ వల్ల అమితంగా ప్రభావితమయ్యాడు. అతని అభిమాన కవులైన ఖలీల్ జిబ్రాన్, పాబ్లో నెరూడాల కవిత్వంలో తన కోసం నిత్యం గాలించుకొనే వాడు. ఆఖరికి “దళిత సాహిత్యోద్యమంలో ఒకడిగా చేరే అవకాశం తనకు కలిగింది” అని విధేయతతో ప్రకటించుకొన్నాడు. ఈ సందర్భంలోనే గద్దర్ వ్యాఖ్య గుర్తుకొస్తున్నది. “ఒక మనిషిగా గుర్తించబడని మనిషి గురించి రాసిన కవిత్వాన్ని దళిత కవిత్వమని ఎట్లా అంటారు మీరు? అది మహోన్నత కవిత్వమవుతుంది. కలేకూరి దళిత కవి కాదు, మహాకవి” (హైదరాబాద్ ప్రెస్‌క్లబ్‌లో కలేకూరి ప్రసాద్ సంస్మరణ సభ నాటి ఆయన ప్రసంగం నుంచి; దళిత్ కెమెరా). ఇటువంటి మాటే నామ్‌దేవ్ ధసాల్ కూడ అన్నాడు: “I do not differentiate between political poetry and non-political poetry.” (Namdeo on Namdeo)

* * *

నేను ఆశించినంత సమగ్రంగా కవితల్ని సమీకరించలేక పోయాను. స్వీయ కవితలు 33, అనువాద కవితలు 17 మాత్రమే సంపాదించగలిగాను. మొదటినుంచీ అతని కవిత్వసంపుటం ప్రచురణలో జరిగిన తీవ్రమైన జాప్యాన్ని బట్టి ఈ విధంగా పుస్తకాన్ని అందుబాటులోకి తీసుకొచ్చాను. ఈ కవితల్ని ప్రధానంగా అరుణతార, ఆంధ్రజ్యోతి, వార్త, ఏకలవ్య, బహుజన కెరటాలు పత్రికల నుంచి; చలపతి విజయవర్ధనం, కావడి కుండలు, నువ్వే లేకపోతే, దారులేసిన అక్షరాలు సంకలనాల నుంచి తీసుకొన్నాను. ఇంచుమించుగా అన్ని కవితలకి వాటి ప్రథమ ప్రచురణనే ఆధారం చేసుకొన్నాను. గట్టున కూర్చున్నవాడు విప్లవ/

దళిత కవినని వీరమద్దెల వాయించే కాలంలో, నిండా మునిగితేలిన కవి, కార్యకర్త కవితల తొలిప్రచురణ వివరణలివ్వడం అవసరంగా భావించాను. 1984నుంచి 2012 మధ్య కాలంలో ప్రసాద్ రచన వ్యాసంగం కొనసాగింది. అదే అనుక్రమంలో కవితల్ని పొందుపరిచాను. మా సంయుక్త కవిత FIRST ROAD TO POETS LODGEకి చోటు కల్పించాను. అతని పాటల్ని జనం హృదయగతం చేసుకొన్న రీతిలోనే వచన కవిత్వపాదాల్ని కూడ అనేక మంది కంఠస్థం చేశారు. అలానే కొన్ని కవితల్ని పలుమార్లు పునర్ముద్రించారు. ప్రస్తుతం సాహిత్య వ్యాసాలు, పాటల తేనెతుట్టె జోలికి వెళ్ళలేదు. కాని ప్రసాద్ పాటల్ని జనబాహుళ్యంలో మారుమోగించిన గాయకులు నూకతోటి బాబూరావు, డప్పు ప్రకాష్, చంద్రశ్రీలను ఈ సమయంలో కృతజ్ఞత పూర్వకంగా గుర్తుచేసుకొంటున్నాను.

* * *

సింహావలోకనంతో నేను వివశుడినై ఎందుకివన్నీ ఏకరువు పెడుతున్నాను? ఈ కవి వెనుక ముప్పయ్యేళ్ళ ఉదాత్తమైన రచన వ్యాసంగం ఉంది, ఈ కార్యకర్తకి కులనిర్మూలన పోరాటంతో ఎడతెగని సంబంధం ఉంది. సహచరులు ముగ్ధులమయ్యే సమసమాజమనే అచంచల స్వప్నం ఉంది. కాబట్టి ప్రసాద్ అంటే మాకు సర్వదా ఆదరం, గౌరవం. ఆద్యంతం అతని అక్షరమంటే గురి. ఈ రచనల్ని శిరసున పెట్టుకొన్నాం. బ్రహ్మచెముడు ప్రపంచం మీద ఆగ్రహంతో పదేపదే బిగ్గరగా చదువుకొన్నాం. ఆనాడు నేను పనిచేసిన దినపత్రికలో ప్రసాద్ రచన ప్రచురించడం పట్ల అభ్యంతరం ఉన్నప్పటికీ అవిశ్వాసం, అంటరాని ప్రేమ, సారాజ్జెం, 18 డిసెంబర్ 1996, ఓ మహాకవీ వంటి అద్భుతమైన కవితల్ని నెలకొకటి వంతున అచ్చువేయగలిగాను.

ఒక ఇంటర్వ్యూలో ప్రసాద్ తన కవితల గురించి మాట్లాడుతూ "కాలానికి నిలబడగలిగే శక్తి ఉంటే ఉంటాయి, లేకపోతే లేదు" అన్నాడు. అసలు ఏ రచనైనా కాలానికి నిలవడమంటే ఏమిటి? సత్యసంధతతో తరతరంగా చదువరి హృదయంలో కలరవం కావడమో, కలకలం

రేపడమో కదా! గాలికి కొట్టుకుపోవడానికి అతనెన్నడూ సాహిత్యేతర ప్రయోజనాల కోసం రాసింది లేదు. ఆనాటి కోటేశు నుంచి ఇటీవలి రోహిత్ వేముల, ప్రణయ్ పెరుమాళ్ళ వరకు లెక్కకు మిక్కిలిగా బలితీసుకొన్న ఈ దేశపు రాచపుండుకి అతని రచనొక కత్తిగాటు వంటిది. దురా'గతమే' పునరావృతమవుతోన్న వర్తమానంలో ఈ కవిత్వం ప్రాసంగికత గురించి ప్రత్యేకంగా చర్చించనక్కరలేదు. I shall return to this Bengal అన్న జీవనానందదాసు లాగ 'మళ్ళొక్కసారి మీ నగరానికి నడిచివస్తా'నని కవి ఓ కవితలో వాగ్దానం చేశాడు.

"కులం కులానికీ తలారుల్ని సృష్టించి
నువు పొందిన నిశ్చింతల విశ్రాంతిని
గద్దనై ఎగరేసుకుపోతాను
మండుతున్న గుండెలయల్ని
నీ పాదరిళ్ళకు తగిలించి
నీ నిదుర దీపాన్ని ఆర్పేసిపోతాను
నల్లదేహాలను నిరసన జెండాలుగా ఎగరేసి
గాయాల దిగంబరత్వంతో
మీ స్వర్ణోత్సవ వేదికల మీదికి నడిచివస్తాను" అని

తర్జనితో హెచ్చరించి వెళ్ళాడు.

అతని ఉజ్వలమైన ప్రాణస్పందనలు నేటికి 'అంటరాని ప్రేమ' సంపుటం రూపమెత్తి మన చేతులకి అందివచ్చింది. ఇదొక దహనకేతనమై కలేకూరి ప్రసాద్/యువక లేని ఖాళీని పూరిస్తోంది.

– నామాడి శ్రీధర్

24 ఫిబ్రవరి 2019



## సృజన


| | |
|---|---|
| రోడ్డు | 17 |
| మేం అరుస్తూనే వుంటాం | 19 |
| దేశం మోనాస్టరీలో | 23 |
| చల్తే... చల్తే | 27 |
| నువ్వే నేను | 29 |
| ఒలికిపోయిన పాట | 30 |
| భ్రమల వ(వి)లయం | 32 |
| పిడికెడు ఆత్మగౌరవం కోసం | 36 |
| సారా హుషార్ | 38 |
| పితృత్వం | 40 |
| అవిశ్వాసం | 41 |
| అంటరాని ప్రేమ | 43 |
| సారాజ్జెం | 45 |
| కులం ఉరితాడు | 46 |
| 18 డిసెంబర్ 1996 | 49 |
| గుండె తుడుం మోగాలి | 52 |
| బాబా అంబేద్కరా | 53 |
| FIRST ROAD TO POETS LODGE | 55 |
| విలాస్ గోగ్రే | 60 |
| మళ్ళొక్క సారి | 63 |
| బహుశా మనది ఒక దేశం | 65 |
| హృదయ చాలనమ్ | 67 |
| బిగిసిన పిడికిట్లో | 69 |
| సరికొత్త ఉదయం కోసం | 70 |
| సుషమా | 71 |

యిప్పుడొక పాట కావాలి 72
అమ్మా! అంబేద్కరా 74
నువ్వే నేను (తెలం'గానం') 77
ముఖచిత్రం 79
అతనొక నిబద్ధ వజ్రాక్షరం 82
గోరటి ఎంకన్న 83
కోబలి 84
బహుశా ఇది పరీక్షా సమయం 86

## అనుసృజన

మండే కన్నులు 89
కొండరావి చెట్టు 90
నేరస్థుడు 91
అమరుని మాతృమూర్తి 92
ముందుమాట 94
ఆఫ్రికా! ఆఫ్రికా! 95
శ్వేతపత్రం 97
ఓ మహాకవీ 99
ఒక జనన సందేహం 101
జాలిపడాల్సిన జాతి 104
అంబేద్కర్ కోసం 106
యిప్పుడింక నువ్వు నాకు సొంతం 107
మరణానందాలకు వారసత్వం వద్దు 109
పాట 111
దేవుడితో ఈవ్ సంభాషణ 112
దేహం 115
మహాశ్వేతాదేవి కోసం 117

కలేకూరి దస్తూరి 118
స్మృతి కవితలు 121
కలేకూరి పుస్తకాల జాబితా 125

# రోడ్డు

రోడ్డూ నాలాగే దళిత
గుండెల మీది పాదముద్రల్ని
తడుముకుంటూ
గతంలోకి ప్రవహిస్తుంది

భయమో సందేహమో
ఎద మీటిన కనురెప్పల
జలతరంగణీ రాగమో
గుండె మీద చెవిపెట్టి వింటే
తారు ఉడుకుతున్న
కుతకుత చప్పుడు

రోడ్డూ నాలాగే దళిత
పొలంగట్ల అలజడి వింటే
తల్లిపేగై చలించిపోతుంది
మొరటుపాదాల కరాళ నృత్యానికి
ఉగ్రమూర్తయి జ్వలించిపోతుంది
తనను తాను చెప్పుకోవాలని
తనను తాను నిలుపుకోవాలని
నేలనేలంతా పాటగా పరచుకోవాలని
తపించిపోతుంది

అవునూ
అడుగడుగునా
శిలువలు పాతుకున్న

రాదారి పాటనెప్పుడైనా విన్నావా?
దారులన్నీ పెనవేసుకుపోయి
రోడ్ల ఊరేగింపైన సందోహాన్ని
ఎప్పుడైనా చూశావా?

దాడికి గురైన శవమై
అడ్డం తిరిగి
మొత్తం చలనాన్నే స్తంభింపజేసిన
రోడ్డు ధిక్కారగీతంలో
ఎప్పుడైనా గొంతు కలిపావా?

ఈ రోడ్డు మీదుగా
ఒకసారి మా ఊరికి రా *

*(ఆంధ్రజ్యోతి, ఆదివారం)*

## మేం అరుస్తూనే వుంటాం

సూరీడా, మా పుట్టింటి చుట్టమా
మా కోసం అన్వేషిస్తూ
గగన వీధులన్నీ కలియ తిరుగుతున్నావట
మా గత జీవన శకలాల కోసం
'పుస్తకాల శ్మశానాల'న్నింటినీ పరిశోధిస్తున్నావట
మా అస్పృశ్యతా జీవితాలతో
నీ కిన్నాళ్ళ కిప్పుడేం పని పడిందయ్యా?

మే మాకాశంలో తారకలం కాము
మా జీవితాలు
పుస్తకాల కెక్కేంతటి
'చరితార్థాలూ' కావు

వెదురుముక్కలా
మా గుండెలూ చిల్లులు పడ్డా
అవి వేణుగానాన్ని వెలువరించలేవు
మా నిశీధి జీవితాలు
కుహూ కుహూ కోయిలల రాగాలు కావు
'నిశి' కోయిళ్ళమూ కాము
కీచురాళ్ళము మేము
మా గీతాలు
కీచు కీచు ధ్వనుల రోదనలు

సూర్యుడా, మా పుట్టింటి చుట్టమా
మా కోసం వినువీధుల్లో వెతక్కయ్యా

ఈ చీకటి రాత్రి
మా గొంతు కండరాల రాపిడికి
జనించే నిప్పురవ్వల ఆక్రందనలను
నీకు వినబడనివ్వక పోతే
మే మేద్వలేని మా ఎట్టి మట్టి బతుకుల మీద
అగ్గన్నా కురవ్వయ్యా
మా మండిపోయే జ్వాలలన్నా
నీకు మా ఆచూకీ చెప్తాయేమో!

* * *

సజీవ ఖననం చేయబడ్డ
మా కపాలాలు పులిసిపోయి
నాటుసారా కాంట్రాక్టర్ల జేబులు నింపుతున్నాయి
అరచీ అరచీ మా నాలుక
యీనె లీనెలుగా చిరిగిపోయి
వాళ్ళ మరుగుదొడ్లూడ్చే చీపురయ్యింది
కమిలిన మా చర్మం
వారి సుతిమెత్తని పాదాలు కందకుండా
రాజవీధులపైన పరువబడింది
యింక మా మానప్రాణాల సంగతి
ఏమని విన్నవించను
అయినా
కారంచేడు బతుకుల గాళ్ళం
మా కోసమెందుకయ్యా వెతుకులాట

సూర్యుడా, నా పుట్టింటి చుట్టమా
మా చిందిన నెత్తురు
పచ్చని పొలాలను ఎర్రబారిస్తే

మా చైతన్యం పలాయనమైంది
ఒట్టి బెదురుగొడ్డు గాళ్ళం
చరిత్ర పుటల కంటిన
'మరక'ల లాటి వాళ్ళం
మేము నిన్నంటుకుంటే
నీ పరాక్రమానికీ
అపవాదే లేవయ్యా
మా చైతన్యం 'స్థాయి'
అందుకోలేనంత ఎత్తున నువ్వు
పాతాళపు బురద మడుగుల్లో మేము

* * *

ఎవరెవరి పాటలకో
పల్లవౌదామని మా ఆశ
తగుదునమ్మా అని మేమూ గొంతెత్తితే
అవి హృదయ రంజకాలెలా అవుతాయి?
కుల కాంతలకా ధ్వనులు
సంస్కార విహీన, కర్ణకఠోరాలుగా వినబడి
భయకారణాలౌతాయి
కీచు కీచురాళ్ళము కదూ

వాళ్ళనేమని తప్పుపట్టేము
పసిపాపలకా రుంజనాదాలు
శ్మశాన స్థలాలను తలపింపచేస్తాయి
ఇంకే పాటల పల్లవయ్యేము!
సూరీడా, మా పుట్టింటి చుట్టమా!
మేం పుట్టినప్పటి నుండీ అరుస్తూనే వున్నాం
నువ్వు మాకో, మేం నీకో దొరికేంత వరకూ

(దొరకలేదన్నది పచ్చినిజం కదూ)
అరుస్తూనే వుంటాం
కీచురాళ్ళము కదూ!
చీకటున్న (పోయే)ంత వరకూ
అరుస్తూనే వుంటాం

మా అరుపులన్నీ
వెలుగు రవ్వలయ్యేంత వరకూ
అరుస్తూనే వుంటాం
అందుకే సూరీడా, మా పుట్టింటి చుట్టమా
మా అరుపులు విని జడుసుకొనే మిత్రులకు
మేం శత్రువులం కామని చెప్తావు కదూ! *

*(అరుణతార; ఏప్రిల్, మే 1987)*

# దేశం మోనాస్టరీలో

"పరలోక మందున్న మా యొక్క తండ్రీ!
మీ నామము పరిశుద్ధ పరచబడును గాక
మీ రాజ్యం మాకు వచ్చును గాక"
చీకటి మడుగుల్లో కూరుకుపోయిన
భయంకర బాధామయ ఆక్రందనల పైన
ఎంత చిక్కటి జలతారు ముసుగు!

కొడిగట్టిన మిణుగురైనా చాలనుకునే
అభాగ్యజీవుల కనుల ముందర
ఎంతటి విహ్వాల ప్రకాశమాన కాంతి మరీచిక!

ప్రభూ!
అసుర సంధ్యాకాలంలో విశ్వం యావత్తూ సాగిన
నా మస్తిష్కపు ప్రచ్ఛాయా!
గాఢాంధకారాన్ని ప్రతిఫలించే
నా జ్ఞానేంద్రియాల జ్ఞానమా!
ఉదయాన ప్రార్థన చేయ మరచినందుకు
కడుపుమాడిన బాల్యం
'కృతజ్ఞతార్పణా ప్రార్థన' ముగించకుండానే
ముద్ద నోట్లో వేసినందుకు
మధ్యాహ్నపుటెండలో, కంకర యిసుకలో
శిలువ బడినప్పుడు
కన్నుల్లో నెత్తురు చిప్పిల్లిన దృశ్యం
ఎంత హింసాత్మక అనుబంధమో మనది!

ప్రభూ!
ఓ నిస్సారపు జీవితాల సారమా!
ప్రేమమూర్తివై చేరబిలిచే నీ బాహువుల్లో చేరబోతే
నీ పరిష్వంగంలో ఒదగబోతే
ఫెళీల్మని నా తలకు తగిలినవి
బలిపీఠాల పాదాలు
ఎటు తడివినా గొర్రెపిల్లల నెత్తుటి చిత్తడి!

ఓ హింసాత్మక ప్రపంచపు అహింసాశయమా!
ప్రభూ!
మరఫిరంగులు బారుచేసి, దేశాన్ని యుద్ధరంగంగా మార్చి
నెత్తురుటేరులు ప్రవహింపచేయడమే హింస కాదు
కత్తులు ఝుళిపించి
సతతహరిత మైదానాలను రుద్రభూమిగా
పీనుగపెంటలుగా మార్చేయడం మాత్రమే హింస కాదు
పెదవులు కుట్టేసి, గళాలకు లోహపాదాలడ్డేసి
గుండెలయల సంగీతాన్ని
నిలిపివేయడం మాత్రమే హింస కాదు

మామిడి కొమ్మకు
జిల్లేడుకాయలు మొలిపించడమూ హింసే
జ్ఞాన సముపార్జనకు శుక్రనేత్రం అడ్డేసి
నరాల్లోనికి అజ్ఞానాన్ని ఇంజెక్ట్ చేయడమూ హింసే
ఆశలన్నీ ఆవిరై ఓ అబల ఆర్తనాదం చేస్తే
బాధ భరించలేక ఓ రోగి ఆత్మహత్య చేసుకుంటే
మానవీయ సమాజం
కులాలుగా, మతాలుగా, వర్గాలుగా, వ్యక్తులుగా

ఒంటరులుగా నిర్వీర్యమవుతోంటే... అది హింస
ఏ బలిపీఠమైనా గొర్రెపిల్లల కోసమే తయారవుతుంది
ఏ బలిపీఠం పైన ఏ గొర్రెపిల్ల బలైనా
అది 'ఇచ్ఛికా'ర్పణే!
అప్పుడు దాని ఒళ్ళు జలదరించినా
అది 'అమ్మవారు పూనడమే' కానీ... తిరస్కృతి కాదు!

ప్రభూ!
మృత్యుపరిష్వంగంలో
సతమతమవ్వడమూ 'ఇచ్ఛిక'మేనంటే
ఇష్టాలు రూపొందే క్రమాన్ని ప్రశ్నిస్తాను నేను
ప్రశ్నా... దాని సమాధానాన్వేషణా వుంటే
నీ ఉనికి ఎక్కడ?
దేశం మోనాస్టరీలో విషాదగుహలో
ఇచ్ఛిక బందీలైన గొర్రెపిల్లల ముఖాలలో
కదలాడే విషాదవీచికలను శృతిచేసి
ఎవరైనా పలికిస్తే
ఆ హృదయాలలో గోచరించే
విలాపగీతికను ఎవరైనా పలుకరిస్తే
ఆ నెత్తుటి శిలలు ఆకాశాలుగా సాగి
సముద్రాలై ఘోషిస్తాయి
ఆ జనపదాల బాణీలు
బయినెట్లపై మెరుస్తాయి

ప్రభూ! సూర్యోదయ వేళవుతున్నది
పృథ్వినిండా చేతనాకుసుమాలు వికసించి
నులివెచ్చని కిరణాలు ప్రసరించి

అంధకారపు పొగమంచు కరిగిపోయే వేళవుతున్నది
ఇప్పుడు సంగీత పరిమళాలను వెదజల్లుతోన్న గాలి
సముద్రాన్ని మీటి వస్తోన్నది *

*(అరుణతార; నవంబర్ 1987, జనవరి 1988)*

# చల్తే... చల్తే

చిరునవ్వుల స్వప్నాలను చిదిమేస్తాడు వాడు
చిదిగిన స్వప్నాలను కర్కశంగా ఖననం చేస్తాడు వాడు
కానీ... సమాధుల ప్యూపాల పగుళ్ళ నుండి
రెపరెపా రెక్కలార్చుకుంటూ సీతాకోకచిలుకలా
ఆకాశాని కెగురుతుంది ఆకాంక్షల పతాకం

ఆకాశాన్ని అవనతం చేయబోతాడు వాడు
దృశ్యాలకు చీకటి ముసుగులు కప్పి
అదృశ్యం చేయబోతాడు వాడు
కానీ... తెలితెలి రేకల సూరీడ్ని సిగలో తురుముకుని
ముసిముసి వెలుగుల స్వప్నాల నవ్వుల్ని
వెదజల్లుతుంది ప్రభాతం

ప్రభాతాలను చెరబట్టబోతాడు వాడు
జీవధారకు శుక్రనేత్రం అడ్డేసి కాలాన్ని శాసించబోతాడు వాడు
కానీ... కటకటాల పురిటినొప్పుల పాట ప్రభాతగీతమై
ప్రజా చైతన్యాయుధమై...
గుండె గుండెనా వికసిస్తుంది అరణ్యనేత్రమై

సహజేచ్ఛల అరణ్యాన్ని దగ్ధం చేయబోతాడు వాడు
మలయ శీతల మారుత సంగీతాన్నీ
గలగలా సెలయేళ్ళ లయలనూ
ఖాకీ క్రూర కోరలతో కలుషితం చేయబోతాడు వాడు
కానీ...
గాయపడ్డ గుండె గోడల నుండి
ఒలుకుతోన్న జెండారంగు బొట్టుబొట్టుగా నేలను మీటిన చోట

నేల నేలంతా స్మృతిగీతికల సజీవ శబ్ద దృశ్యం
చెలరేగిపోతుంది నిప్పుల అరణ్యమై

జ్ఞాపకాల డైనమైట్లను
కాగడాలతో కాల్చేయబోతాడు వాడు
కానీ... ఒక్కొక్క జ్ఞాపకమూ
ఎన్నెన్నో ఊరేగింపుల నినాదమవుతుంది
పెళ్ళున విస్ఫోటనమై

నినాదాల ప్రవాహానికి అడ్డంగా
నిషేధాల గుర్రపు డెక్కల్ని మొలిపించబోతాడు వాడు
కానీ... బిందువు బిందువుగా నినాదాల పాట
గుండె గుండె నిండా నిండిపోతుంది చాపకింది నీరై
జన జీవనాకాంక్షల స్వప్నగానమై! *

*(అరుణతార; ఏప్రిల్ 1988)*

# నువ్వే నేను

లోహపాదాల కరాళనృత్యం ముగిసిన తరువాత
నా పూలతోట నుదిటి మీద
శ్మశానముద్ర వేసిపోతాడు వాడు
నా ఆకాశాల పైన
అవాంఛనీయ అక్రమ యుద్ధం ప్రకటించి
నా స్వప్నశకలాల కంఠాలకు
ఛిద్రగీతికల మాలలు వేలాడేసిపోతాడు వాడు

క్షతగాత్రి పూమొగ్గా
నీ వెచ్చటి కన్నీటిబొట్టులలోని వెన్నెల జీరలు
నా హృదయంలో వాయులీన రాగాలు పలికిస్తున్నవి
నీ కన్నులలో గోచరించే ఆత్మవిశ్వాస వీచిక
నా గుండెలకు ప్రాణవాయువులందిస్తున్నది

ఓడిపోయిన మానవుడా!
నీ నులివెచ్చని శ్వాసలలో తడిసి
నా అక్షరాలు అరణ్యాలుగా విస్తరిస్తాయిప్పుడు
విశ్వమంతా వ్యాపించిన నీ హృదయతంత్రులను
నా గళంలో మీటుకుంటాను నేను
నీ ఎండిన పెదవులపై వాలిన నా పాట
మార్గశిరపు ఎండలా
నీ ముఖంలో నవ్వులు పూస్తుంది *

*(అరుణతార; అక్టోబర్ 1988)*

## ఒలికిపోయిన పాట

కాలం కేవలం సాక్షిగా మాత్రమే మిగుల్తుంది
నీలి నక్షత్రాలు గజగజా వణుకుతాయి చీకట్లో తడిసి
ఆకాశంలో పరిభ్రమించే చీకటి కెరటాలు
రక్తనాళాల్లో ధ్వనించే జీవనాదాన్ని
కబళించివేస్తాయి మృత్యునాల్కలు సాచి

అమ్మా! మా కన్నతల్లీ!
నీ పాట కోసం
నీ వాకిలిముందు నిలబడిన కోకిల గుంపుల్ని చూసి
నీ చిరునవ్వుల కోసం ఎగిరివస్తోన్న చల్లగాలిని చూసి
నిన్నెక్కడెక్కడో వెతుకుతున్నాం
నీరింకిన సముద్రంలో అలల జాడ వెతుకుతున్నట్లు

నువ్వు మాత్రం
మా కన్నీరూ ఆవేశాలూ ఉద్వేగాలూ
అంటనంత దూరాన కూర్చుని ఘనీభవించిన గోదావరివై
మాకందకుండానే ఒలికిపోయిన పాటవైపోయావు
సమాజం వికృతముఖం మీద తుపుక్కున ఉమిసిపోయావు

నా తల్లీ!
నీ అడుగుల తడబాటు చెదిరిపోతున్న
దృశ్యాన్ని చూసి మురిసిపోయామే తప్ప
నీ వెన్నుపాములోని విశ్వాసాన్ని తొలిచేసే
ఉత్తరాల పురుగుల్ని గమనించలేకపోయాం
సముద్రఘోషను అనువదించలేని

మా నిస్సహాయతను ఇప్పుడు మేం తిట్టుకుంటున్నాం
మమ్మల్ని మేం ముద్దాయిలుగా ప్రకటించుకుంటున్నాం

తల్లీ
నువ్వు మాలోకి ఎలా నడచివచ్చావో అలా వెళ్ళిపోలేదు
కళ్ళనిండా స్వప్నాలతో జీవితాన్ని వెతుక్కుంటూ వచ్చావు నువ్వు
క్రౌర్యాన్ని కాపట్యాన్ని ద్వేషిస్తూ వచ్చావు నువ్వు
సముద్రాలు పొంగే గుండెలతో వచ్చావు నువ్వు
నిలదొక్కుకునే నీ ప్రయత్నాలు
సన్నటి నైలాన్ దారం మీది నడకలయ్యాయి
కింద కోరలు సాచిన మృత్యులోయ... మొగలిపొదల సీమ
అడుగడుగునా పడగలు విప్పిన విషభుజంగాలు
నా తల్లీ!
హింసోన్మత్తత నిన్ను జీవితం కొనదాకా
తరిమి తరిమి హత్య చేసింది
కాలం సాక్షిగా మిగిలిపోయింది

కాలం సాక్ష్యం జ్వలిస్తుంది ప్రతీకారాన్ని కోరుతుంది
నీ నిష్క్రమణ మాకు హెచ్చరిక అవుతుంది గొప్ప విస్ఫోటనమవుతుంది
అమ్మా నిన్ను మా అక్షరాల్లోకి ఎత్తుకుంటాం
గుండెల్లో పొదువుకుంటాం
కళ్ళల్లో మెరిసే ఎర్రని జీరల్లో నిన్ను నిలుపుకుంటాం *

*(అరుణతార; అక్టోబర్ 1988)*

*(ఈశ్వరి స్మృతిలో రాసిన కవిత. ఈశ్వరి కవయిత్రి, విరసం సభ్యురాలు. స్వస్థలం తూర్పుగోదావరి కోనసీమ. 1976లో ఆమె శ్రీశ్రీకి రాసిన ఉత్తరం ఆయన 'అనంతం'లో ఒక వారం యథాతథంగా అచ్చువేయించారట. ఈశ్వరి తన విషాదభరిత జీవితం నుంచి 1988లో బలవన్మరణంతో నిష్క్రమించింది)*

# భ్రమల వ(వి)లయం

మిరుమిట్లుగొలిపే కాంతిముందు నిలబడితే
కళ్ళు బయర్లుకమ్మి చీకట్లు ముసిరినట్లు
ఈడ్చి మూతిమీద తంతే తళుక్ తళుక్ నక్షత్రాలు మెరిసినట్లు
విలయ విలయంగా ఒక భ్రమల వలయం పరిభ్రమిస్తుంటుంది

'కాయ్ రాజా కాయ్, కాయ్ రాజా కాయ్'
గెలిచేవాళ్ళకు పోయేదెంతో, ఓడేవాళ్ళకు వచ్చేదెంతో
'కాయ్ రాజా కాయ్, కాయ్ రాజా కాయ్'
అందరూ ఇక్కడ మాయాజూదంలో పాండవులే
రాజ్యాన్ని కోల్పోయి చారెడు నేల లేక
అప్రతిభులై అరణ్యాలకు తలవంచుకు తరలిపోయే 'ధర్మో'పహతులే
మోసెడు లేనితనం కోసం 'ఏలినవారి దేవతా వస్త్రాల కోసం'
కురుక్షేత్ర సంగ్రామం

ప్రతిభా! ప్రతిభా!
మంచి బాలుడు రాముడు చేతికి చిక్కిన అద్దంలో చందమామా
గులాబీ బుగ్గల కాన్వెంట్ వనంలో కూస్తోన్న రైము కోకిలా
నీ పేరున వీధుల్లో ఊరేగింపులు జరుగుతూ వుంటే
స్కూలు యూనిఫారం ధరించిన మనువు సహస్రాధిక రూపాలు
బతుకుల మీద కవాతు చేస్తున్నట్లు
పీఠాధిపతుల ప్రవచనాల ప్రభంజనాలు
లోకాన్ని ముంచెత్తుతున్నట్లు గుండెలు జలదరిస్తున్నవి

ప్రతిభా! ప్రతిభా!
అగ్రరాజ్యాల శిఖరాగ్ర శాంతి సమావేశంలో

వెల్లివిరిసే హిరోషిమా రాగమా
పొలం గట్లమీది పల్లె కలలపై
భళ్ళున తెల్లారిన బోఫోర్స్ మెలకువా
ప్లాస్టిక్ నవ్వుల నందనవనంలో
లిప్‌స్టిక్ తుషారాలై కురిసే వలస వెన్నెలా
సరయూ నదీతీరాన
శంభూకుడి నెత్తురు ఏరులు కట్టించిన దౌష్ట్యానికి
ఎంచక్కటి ముద్దుపేరు!
చెవుల్లో సీసం కరిగించి పోసి నాల్కలు చెండాడి
అంగాంగం ఖండించి
మెదడు మైదానాలకు ధర్మకచ్చడాల ముళ్ళకంచె హద్దులు పాతి
బతుకుల్ని తరతరాల దాస్యంలోకి నెట్టిన కుటిల జ్ఞాన చౌర్యానికి
ఎంత మేలిమేలి జలతారు ముసుగు!

తన బాహువుల్ని వేనవేల కుంచెలుగా చేసి
భూమి కాన్వాస్‌పై సహస్రవృత్తుల శ్రమసౌందర్యాన్ని
సజీవ చిత్తరువులు గీసిన చిత్రకారుడ్ని బురదలో బంధించి
బందిపోట్లు వెలగబెట్టే దొరతనమయ్యింది ప్రతిభ
బతుకుల్నించి బతుకుతనాన్ని లాక్కుని
మనిషినుండి మనిషితనాన్ని దోచుకుని
చేతులనుండి శ్రమను దొంగిలించి
పొలం గట్లమీద తెగిన పసిపేగులు పాలకోసం గుక్కపట్టి అల్లల్లాడితే
అరవిచ్చిన గులాబీల్లా పెదవులు విచ్చి
వెన్నెల నవ్వులు రువ్వింది ప్రతిభ

మేం మట్టిలో రొచ్చులో కుళ్ళులో కష్టాల రొంపిలో
కుమిలిపోతుంటే

మా గుండెల మీద కుంపట్లు మోపి
ఎయిర్ కండిషన్డు గదుల్లో పగలబడి నవ్వింది ప్రతిభ
గొంతుల్లో కన్నీటి వరదల్ని కూరుకుని
నాగేటిచాళ్ళ పాపట దువ్వి మేం పువ్వాకు రెమ్మల పాదులు దీస్తే
మా మాంసాన్ని వేపుకుతిని బార్ రూముల్లో పాప్ మ్యూజిక్కై
విలయ తాండవమాడింది ప్రతిభ

ఇప్పుడు ప్రతిభంటే
తొలిసారి వేటను సాధించిన ఆదిమ మానవుడి
తుళ్ళింతల కేరింతల ఆనందతాండవం కాదు
సంపూర్ణత్వం నిండిన మనిషితనమై
పరిమళించే సుందర స్వప్నం కాదు
మృదుల మృదుల నాదంగా వీనుల విందు గొలిపే
స్వేచ్ఛా కపోతాల రెక్కల సవ్వడి కాదు

ఇప్పుడు ప్రతిభంటే
పచ్చపచ్చటి పంటపొలాల్ని
నెత్తుటి వరదలు ముంచెత్తిన కరకు భూస్వామ్య క్రౌర్యం
మనుషుల నెత్తురు తాగి జాతుల్ని ధ్వంసం చేసి
దేశాల్ని కబళించిన హిట్లర్ జాత్యాహంకార వికటాట్టహాసం
హతం చేసినా ఆత్మాహుతి చేసుకున్నా
ఇప్పుడు ప్రతిభంటే
రెక్కలు చాస్తోన్న మూర్తీభవించిన రాజ్యహింస
ధర్మం ఏడెనిమిది పాదాల నడిచే వేళ ధర్మ సంరక్షణార్థం
ఏసీ రథమెక్కిన అయోధ్యారాముడు తలవంచి చేతులు కట్టుకుంటే
అసమాన తేజ రాజభోగమై
విహ్వాలించిన 'ప్రతిభ' తలయెత్తి నిలబడితే

దిక్కుతోచక పొర్లాడే అరాచక రాచకీయం
ఒక మరులు గొల్పే భ్రమ
ఒక హింసాత్మక వాస్తవికత

ప్రతిభా!
నీ అసలు పేరు అసమానత్వం
తల్లి రొమ్ము గుద్ది విదేశాలకు వలసపోయే
ప్రతిభావంతుల్ని సృష్టించిన మట్టిమనుషులం
బ్యాలెట్ పెట్టెల్లో తలల్ని పులియబెట్టి
ఇన్నేళ్ళ అరాచకత్వాన్ని సృష్టించిన
రాజనీతి ధురంధరుల్ని నిలబెట్టిన అలగా మనుషులం
నువ్వు కాళ్ళూ చేతులూ కట్టి పరుగు పందానికి పిలిస్తే
మేం స్వచ్ఛమైన ప్రతిభ కోసం సంపూర్ణ మానవుడి కోసం
గాయాల యాగం చేస్తున్నాం

మా కనురెప్పల కింది చీకటిలో
ఖననమైన కంచికచర్ల కోటేశును
పునఃసృష్టి చేసి నూతన మానవుడిని ఆవిష్కరిస్తాం
ఒక వసంతం కోసం
లక్ష శిశిర ఎడారుల గుండా నెత్తుటి ప్రస్థానం చేస్తాం *

*(అరుణతార; ఏప్రిల్ 1991)*

*(ఇది నవత, యువకల సంయుక్త కవిత.*

*1990 మండల్ కమిషన్ వ్యతిరేక ఆందోళన నేపథ్యం)*

## పిడికెడు ఆత్మగౌరవం కోసం

నేను ఎప్పుడు పుట్టానో తెలియదు గానీ
వేల ఏళ్ళ క్రితం ఈ గడ్డమీదనే చంపబడ్డాను
'పునరపి మరణం పునరపి జననం'
నాకు కర్మసిద్ధాంతం తెలియదు కానీ
మళ్ళీ మళ్ళీ మరణించిన చోటనే పుడుతున్నాను

నా దేహం ఈ దేశంలో కరిగిపోయి
గంగా సింధూ మైదానమయ్యింది
నా కనుగుడ్లు కన్నీరై ద్రవిస్తే
ఈ దేశంలో జీవనదులు ప్రవహించాయి
నా సిరల నుండి జీవధాతువులు స్రవిస్తే
ఈ దేశం సస్యశ్యామలమై సిరులు కురిసింది

త్రేతాయుగంలో నేను శంభూకుణ్ణి
ఇరవై రెండేళ్ళ క్రితం నా పేరు కంచికచర్ల కోటేశు
నా జన్మస్థలం కిలవేన్మణి, కారంచేడు, నీరుకొండ
ఇప్పుడు కరుడుకట్టిన భూస్వామ్య క్రౌర్యం
నా గుండెల మీద నాగేటి కర్రులతో పచ్చబొడిసిన పేరు చుండూరు
ఇక చుండూరు నామవాచకం కాదు సర్వనామం
ఇప్పుడు ప్రతి గుండే ఒక చుండూరు, రగిలే రాచపుండూరు

నేను జన సమూహాల గాయాన్ని గాయాల సమూహాన్ని
తరతరాలుగా స్వతంత్రదేశంలో అస్వతంత్రుణ్ణి
అవమానాలకూ, అత్యాచారాలకూ,
మానభంగాలకూ, చిత్రహింసలకు గురై
పిడికెడు ఆత్మగౌరవం కోసం తలెత్తిన వాణ్ణి

ధనమదాంధ కులోన్మత్తుల రాజ్యంలో
బతకడమే ఒక నిరసనగా బతుకుతున్న వాణ్ణి
బతికేందుకు పదే పదే చస్తున్నవాణ్ణి
నన్ను బాధితుడని పిలువకండి
నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి!

లోకానికి సంపదల్ని మిగిల్చేందుకు క్షామాన్ని మింగిన
గరళ కంఠుణ్ణి నేను
శీర్షాసనం వేసిన సూర్యోదయాన్ని
నిటారుగా నిలబెట్టేందుకు
సూర్యుడి నెత్తిమీద యీడ్చితన్నిన వాణ్ణి
రగిలే గుండె కొలిమిలో నినాదాలు సరిపిస్తున్న వాణ్ణి
నాకు జాలిజాలి మాటలొద్దు కన్నీటి మూటలొద్దు
నేను బాధితుణ్ణి కాదు అమరుణ్ణి
ఎగిరే ధిక్కార పతాకాన్ని

నా కోసం కన్నీరు కార్చకండి
మీకు చేతనైతే
నన్ను నగరం నడిబొడ్డున ఖననం చేయండి
జీవన రవళిని వినిపించే వెదురువనాన్నై వికసిస్తాను
నా శవాన్ని ఈ దేశం ముఖచిత్రంగా ముద్రించండి
చరిత్రపుటల్లోకి సుందర భవిష్యత్తునై పరివ్యాపిస్తాను
మీ గుండెల్లోకి ఆవాహన చేసుకోండి
ఒక పెనుమంటల పెనుగులాటనై
మళ్ళీ మళ్ళీ ఈ దేశంలోనే ప్రభవిస్తాను *

*(అరుణతార; సెప్టెంబర్ 1991)*

## సారా హుషార్

నరాల్లో జీవనదులు ప్రవహించాలి
తడబడు నడకల్లో ఘల్లు ఘల్లున
సంగీత రవళులు వినిపించాలి
జజ్జెనక జజ్జెనక జనక జనక
బతుకొక్క లయ కావాలి
వారుణి వాహినీ! ప్రవహించు
మా మనుషుల్లోకీ మనసుల్లోకీ
మా గుండెల్లోకీ గుడిసెల్లోకీ ప్రవహించు

మా కుత్తుకలు తెగిపోతున్న
స్పృహే మాకు తెలియొద్దు
మా తలలు పులిసి కాంట్రాక్టర్ల జేబుల్లో కాసులై
గలగల రాలే కర్ణ కఠోరధ్వనే మాకు వినిపించొద్దు
మృత్యులోగిలిలో లోహ కౌగిలిలో
ఒక పెనుమత్తు కావాలి
బతుకు భయాలనూ భయానక మెలకువనూ
మరపించే కమ్మని కలవై మము కరుణించు కోబలీ!

ఒళ్ళు జలదరించాలి
పక్కటెముకల కింద పెద్దపులి అరవాలి
సారా హుషార్! సారా హుషార్!
అప్పో సప్పో బి.ఎం.ఎఫ్ఫో
మా శిరస్సుల్ని మేమే నరుక్కోగల ధైర్యం కావాలి

ఏ మసిబారిన ముఖాలో చంద్రనిప్పులు కురిసి
సారాచకీయాల విషవలయాలు
బూడిదయ్యిందాకా
ఏ వంటింటి సుడిగాలో
రోహిణీ వడగాడ్పులు విసిరి
మా పెనునిద్దర వదిలిందాకా
వారుణి వాహినీ! ప్రవహించు
ఒక సమ్మోహనాల మోహినివై
ఒక క్రూర వికృత ప్రేయసివై
మృత్యు కన్యకవై... *

*(ఆంధ్రజ్యోతి, ఆదివారం; 1992)*

## పితృత్వం

మైడియర్ మిడిల్ క్లాస్ తండ్రీ!

పసిపాపల బోసినవ్వులు కలిగించే ఆనంద తరంగాలూ
వాళ్ళని హత్తుకొన్నప్పుడు కలిగే స్పర్శానుభూతీ
వాళ్ళు కొత్త కొత్తగా అన్నీ నేర్చుకొనేప్పుడు కలిగే గర్వం
జీతాలు రాగానే కొనే బొమ్మలూ, దుస్తులూ
అప్పుడప్పుడూ తీసుకెళ్లే షికార్లూ మాత్రమే కాదోయ్
పితృత్వం అంటే...

రెండు పూటలూ చేయించాల్సిన స్నానం
మూడు పూటలూ మురిపిస్తూ తినిపించాల్సిన బువ్వ
తడిసినప్పుడల్లా మార్చి ఉతకాల్సిన గుడ్డలూ
నలతగా వున్నప్పుడు నిద్రను నిషేధించే కళ్ళూ
అర్ధరాత్రి లేచి ఏడ్చినా విసుక్కోకుండా పాడే జోలపాటా
మారాం చేసినపుడు చూపించాల్సిన చందమామా కూడా! *

*(అరుణతార; ఫిబ్రవరి 1994)*

## అవిశ్వాసం

అవిశ్వాసిని
క్షమించు ప్రభూ!
ఐదు రొట్టెల తోటీ, రెండు చేపల తోటీ
అందరికీ ఆహారం నిజంగానే అందేనా దేవా?

వరద బాధితులంరా నయ్‌నా
మోకాటి లోతు బురదలో
పరుగు పందాలాడుకుంటున్నాం
దేశభక్తుడెవడో రెక్కల విమానాలు కట్టుకొచ్చి
అన్నం పొట్లాలు విసిరేసి పోతున్నాడు
అద్దిర పరుగుర భేటా... పరుగో పరుగు
బువ్వయితేనేం బురదయితేనేం
బొక్కినోడిదే భోజ్యం
కడుపు సగం నిండితే అర్ధాకలి రాగం
అసలు మెతుకే దొరక్కుంటే
ఆరున్నొక్క శృతిలో ఆకలిరాగం

పరలోకంలో మన్నా తిండిని
ఎవరు వండుతారు ప్రభూ!
'చెయికింద కొస్తే చెయ్యి దెబ్బ
కాలికింద కొస్తే కాలి దెబ్బ'
ఒక భ్రమల వలయంలో తిరుగాడుతున్నాం
మా కాళ్ళ కిందకు మమ్మల్ని తోసేసుకొని
కసా బిసా తొక్కేసుకుంటున్నాం
మా మీదకు మేమెక్కి గాయపడుతున్నాం
గాయాలకు గిలిగింతలు పెట్టుకొని నవ్వుకొంటున్నాం

గుండెనిండా నవ్వితే
కన్నీళ్ళెందుకొస్తాయే చందమామా
కన్నీళ్ళన్నీ తాగినా
కడుపెందుకు నిండదే కలువబామా
గొంతులో ఎక్కడో కన్నీటిపొర అడ్డుపడి
వెక్కిళ్ళు వెక్కిళ్ళుగా పాట తడబడుతున్నది

ప్రభో!
నాల్గులింగాల దేవుడెవడో మోహినీ రూపమెత్తి
నన్ను మానభంగం చేశాడు
మేమందరం మా దరిద్రాన్ని
సరిసమానంగా పంచుకొనే వేళ
నిన్ను శిలువేసిన వాడెవడో
నిన్ను దేవుణ్ణి చేసి, నా ఆకాశాన్ని కొల్లగొట్టాడు
నువు నాకిచ్చిన నీ తండ్రి ఇంటిని
శాస్త్రులూ పరసయ్యులూ
రాచకీయ కబేళాసంత చేశారు

ఇప్పుడిక ఏ మగ్ధలీన కన్నీటి ప్రవాహమో
అగ్నిపాతమై కురిసి నిలువనీటిని ఊడ్చెయ్యాలి
ఏ చండాల హస్తమో సిరల్లోనూ ధమనుల్లోనూ
మందుగుండు దట్టించి గుండెకు నిప్పంటించాలి

శిలువెక్కితే ఎక్కాం
క్షతగాత్రులందరి తరఫునా
తిరగెయ్యర కొరడా నా సామిరంగా *

*(వార్త, సృష్టి; 07.09.1996)*

# అంటరాని ప్రేమ

గాయాలు సలుపుతున్నా
గుండెల మీద నీ పాదముద్రల్నే కదా మోశాను
చావు ముసురుకొస్తున్నా
నీతో బతుకునే కదా కోరుకున్నాను
ప్రేమ కోసమే బతకలేకపోయినా
కనీసం ప్రేమ కోసమే చద్దామనుకొన్నాను

ప్రియా!
పొద్దుటన్నంలో పెరుగేసి
నువు పెట్టిన సందేళబువ్వ సాక్షిగా
నా చావుకి కారణమేంటో నిజం చెప్పవా

ప్రియా!
బతికినంత కాలం నిన్నిట్టాగే పిలవాలని
నా గుండే, నెత్తురూ, భాషా
ఎంత తన్నకలాడాయో తెలుసా
చీకటి మాటున మన శరీరాలు
పెనవేసుకు పోయేప్పుడైనా
నిన్ను అమ్మగోరూ అని పిలవడం తప్ప
బతికినంత కాలం కోరిక తీరనే లేదు

మీ వాళ్ళంతా నన్ను రచ్చబండకీడ్చి
పందిరిగుంజకు కట్టేసి
నన్ను గొడ్డును బాదినట్టు బాదుతుంటే
నేను నవ్వుకున్నాను

దీనంగా తలలు వంచుకు నిలబడ్డ
నా జాతి జనాన్ని చూసి ఎంత జాలిపడ్డాను!?
సంగతేందిరా అని మీ వాళ్ళెవరన్నా అడిగితే
నిన్ను ప్రేమించానని అరచి చెబుదామనుకున్నాను
కానీ నేను దొంగనని రచ్చబండ ఆరోపణ
సాక్షివి నువ్వే కదా

చచ్చిన శవాలను తగలబెట్టడం తెలుసు నాకు
కానీ బతికుండగానే మీ వాళ్ళు నాకు నిప్పుపెట్టారు
'తండ్రీ వీరేమి చేయుచున్నారో
వీరెరుగరు కనుక వీరిని క్షమించుము'
పాదిరి గారు చెప్పిన ప్రభువు మాటలు
గుర్తొస్తూనే వున్నాయి

మనం గడిపిన నిద్రలేని రాత్రుల సాక్షిగా
నీ కంట్లో ఒక్క కన్నీటి చుక్క మెరిసినా
నిన్నూ నీ వాళ్ళనూ క్షమించేసేవాణ్ణి

గుండెల్లో నువు రగిలించిన నిప్పుల కుంపటి
వంటి మీద నీ వాళ్ళంటించిన
కిరసనాయిలు మంటలు
ఏ బాధ ఎక్కువని అడిగితే
ఇప్పుడు చెప్పలేను

ప్రియా!
ఈ మంటలు నన్ను అలుముకొంటుంటే
నువ్వు నన్ను వాటేసుకున్నట్టేవుంది *

*(వార్త, సృష్టి; 05.10.1996)*

## సౌరాజ్యం

అదే సిఫిలిస్ దేహం
అంగాంగాల మీద పాతుకున్న జెండాక్షరాలు
ముఖం మీద
శవాల కుప్పలై రాలిన విశ్వాసాలు
ముప్పై మూడున్నొక్క కోట్ల మొగుడు దేవుళ్ళు
మరిన్ని కారంచేళ్ళ మరిన్ని చుండూళ్ళ
వెంటాడే కలల మెలకువలు

సొంత సమాధి పెట్టె కోసం
వేడి నిట్టూర్పుల గుండె కింద దాచుకొన్న
చారెడు పొడినేలనూ
కన్నీటి వరదై ముంచెత్తే
స్వచ్ఛంద సేవా నాయకులు
ఉరితాటి మీది కులం పేరై
వర్థిల్లుతోన్న అదే జీవితం

నా సౌరాజ్యమా!
నీకు యాభై ఏళ్ళు నిండిన తర్వాత
ఇప్పుడు నువ్వంటే
అమితమైన ప్రేమ పుట్టుకొస్తున్నది
ఒక్కసారి రావే...
నా మాల మాదిగ గూడేల దాకా *

*(వార్త, సృష్టి; 16.11.1996)*

## కులం ఉరితాడు

ఉరిపడ్డ దళితుడిని మాట్లాడుతున్నాను
మైకు కోకిలా కాసేపు మౌనం పాటించు
పుడుతూనే తల్లి పేగును మెడకు తగిలించుకున్నవాణ్ణి
ఇప్పుడు నేనొక ప్రకటన చేస్తాను
అందరూ వినయంగా వినండి
మీ పడగ్గదుల్లోనో పూజామందిరాల్లోనో
మోకరిల్లునట్టుకాదు
ఈ దేశపు దళితుడి ముందు
నిలబడాల్సినట్టు నిలబడి వినండి

మీరంతా చెప్తున్నట్లు
నాకు ఈ ఉరితాటి మీద నుండి చూస్తుంటే
సుందర స్వప్నాలేవీ కన్పించడం లేదు
ఆ మాటకొస్తే నాకు కులం తప్ప
మరేమీ కన్పించడం లేదు
ఎంత కరుడుకట్టిన విప్లవకారులైనా
మీ నాగభూషణం, పట్నాయక్‌లనే క్షమించగలరు
మా భూమయ్య కిష్టాగౌడ్‌ల
ఉరులు పడ్డ ఊపిరుల సాక్షిగా
ఈ ఉరితాటి మీద మా పేరే
శిలాక్షరాలతో లిఖితం

పుట్టెడు ఆకలి తప్ప తీరని ఆశలు తప్ప
ఏ ఉన్నతాశయాలూ లేనివాణ్ణి
ఇంత తెలిసిన తర్వాత

ఇంత జరిగిన తర్వాత
ఇప్పుడు మీ ముందు చేతులు జోడించి
ప్రాణభిక్ష పెట్టమని ప్రాధేయపడలేను
ఉరితీసుకోండి నన్నూ నా జాతినీ

నేను నేరాలే చేశాను
పురిటి ముఖం మీద కారుచీకటి అలముకున్నప్పుడు
చికిలించుకొనే చూపుల మీద
ముళ్ళపాదాల కవాతులు సాగిపోతున్నప్పుడు
రక్తసిక్త దృశ్యాల మధ్య తడుములాడుకుంటూ
నేను మిమ్మల్నే అనుకరించాను
నేను నేరాలే చేశాను
ఒక కుర్చీని మార్చడం కోసం
వేలాది పసిప్రాణాలను కాలరాచే
చాకచక్యం తెలియదు నాకు
ఓ చిరునవ్వును వెలిగించి
కోట్ల రూపాయల కుంభకోణాలను దిగమింగే
హవాలా లౌక్యం తెలియదు నాకు
నెత్తురంటిన చేతుల్ని ముకుళితం చేసి
శవాలు మొలిచిన పంటపొలాల ముందు
అశ్రునివాళై నిలిచే ప్రతిభ లేనే లేదు నాకు
ఉరితీసుకోండి నన్నూ నా జాతినీ

చిరుకోరికలు తీర్చుకొనేందుకే
ఇన్ని హత్యలు చేయాల్సిన దౌర్భాగ్యం
ఏ దేశానికీ పట్టరాదన్న కోరిక తప్ప
ఇక ఏ ఆకాంక్షా లేదు నాకు

నా వారసులు సమూహాలై కదలి వస్తారు
తమ నెత్తుటి ధారవోతల్తో
ఈ శాపగ్రస్త గడ్డను విముక్తి చేస్తారు
వాళ్ళకు మాత్రం ఓ వీలునామా రాస్తున్నాను

వీళ్ళనెవరినీ ఉరితీయకండి
వీళ్ళనూ, వీళ్ళ నేరాలనూ, ఉరితాళ్ళనూ
మ్యూజియంలో పదిలపర్చండి
"ఈ నేరగ్రస్త జాతి
ఈ గడ్డమీద సుదీర్ఘకాలం బతికింది" అని
ఓ లేబుల్ మాత్రం అంటించండి *

*(చలపతి విజయవర్ధనం, ఉరిశిక్షలకు వ్యతిరేకంగా దళిత ప్రజాస్వామిక కవులు, రచయితల రాజకీయ ప్రకటన; నవంబర్ 1996)*

*(చిలకలూరిపేట బస్ దహనం (8 మార్చి, 1993) కేసులో ఉరిశిక్ష పడిన దళిత యువకులు సాతులూరి చలపతిరావు, గంటెల విజయవర్ధనరావులను మరణదండన నుంచి తప్పించమనే ఆందోళన నేపథ్యం. వారికి క్షమాభిక్ష లభించింది)*

## 18 డిసెంబర్ 1996

తేదీ ప్రకటితమైపోయింది
చావురేఖ ఆయువుపట్టు దాకా విస్తరిస్తోంది
ఇక వాళ్ళను చంపేస్తారు
పొంతి పిలాతులంతా చేతులు కడిగేసుకున్నారు
ధర్మం న్యాయం నాలుగు పాదాలా నడుస్తోనేవుంది
డెడ్‌లైన్... డెడ్‌లైన్...
మనం సజీవులమో, జీవన్మృతులమో తేల్చే డెడ్‌లైన్...

అవమానంగా వుందిరా
వీధిరౌడీ ఎవడో ఇంటిగడప దాకా వచ్చి
బతుక్కి స్పాట్ పెట్టి పోయినట్టుందిరా
అరవలేను... ఏడ్వలేను...
గుండెల్ని కాల్చే ఆగ్రహాన్ని వ్యక్తం చేయలేను
పుట్టపర్తి పాదాల దగ్గర సాగిలపడిన
నా దేశ సార్వభౌమాధికారాన్ని ప్రాధేయపడలేను

వాళ్ళిక చచ్చిపోతారు
కాళ్ళు నరికేసిందెవడో తెలుసు
అంగవైకల్యాన్ని పరిహసిస్తున్నదెవడో తెలుసు
మనిషి ముఖం కప్పుకున్న మనువు
మన శవాల మీద అసలు రూపంలోనే నర్తిస్తున్నాడు
కానీ శవయాత్రల్లో తప్ప
పచ్చపచ్చటి పొలాలన్నీ నెత్తుటి వరదల్లో తడిస్తే తప్ప
పిడికిళ్ళు బిగించలేని జాతిలో పుట్టానురా నాయినా
గెలిచిన వాడి వికటాట్టహాసాన్ని తప్ప

మరి దేన్నీ ఆస్వాదించలేని జాతిలో పుట్టాను
వాళ్ళెప్పుడు కళ్ళు మూస్తారో తెలిసి కూడా
బీభత్స దృశ్యాల ముందు తప్ప
ఎర్రబారని కళ్ళతో లోకాన్ని చూస్తున్న జాతిలో పుట్టాను

ఉరితాటి ముందు మైకులుండవు కదా
చప్పట్లుండవు కదా
ప్రశంసల మెచ్చుకోళ్ళ చూపులుండవు కదా
సమాధులకు చందాలుండవు కదా

అరవలేను... అరవలేను...
నా స్వతంత్రాన్ని బతుకుతున్నంత అబద్ధంగా
చైతన్యాన్నీ నినాదాల్నీ ఉద్యమ ప్రవాహాల్నీ బతుకుతున్నాను
డేగ రెక్కల కింద నా శవం పదిలమే
నా మరీచికా పోరాటాల్లో నన్ను మునిగిపోనివ్వండి

వాళ్ళు చచ్చిపోతారు ఖాయం
బతుక్కోసం పెనుగులాడీ పెనుగులాడీ
చావును గెలుచుకున్న జాతికి బతుకెందుకు
కానీ మనం కూడా బతికున్నట్టు దాఖలాలేం కన్పించడం లేదు

ఒరే చలపతీ! విజయవర్ధనం!
మమ్మల్ని క్షమించకండి
మీరు హత్య చేసిన ఇరవైమూడు ప్రాణాల కోసం
విలపించీ విలపించీ
మా మౌనం హత్య చేసే మీ రెండు ప్రాణాల కోసం
రెండు కన్నీటి చుక్కల్ని కూడా మిగుల్చుకోలేకపోయాం
మమ్మల్ని క్షమించకండి

పోండి పోండి వెళ్ళిపోండి చచ్చిపోండి
మీ తలలకు నల్లటి గుడ్డ కప్పబోతున్నప్పుడు
మా కోసం చూడకుండా వెళ్ళిపోండి
పోతూ పోతూ
మా బడాయి ప్రగల్భాల మీద తుపుక్కున వుమ్మేసిపోండి
మీ శవాలకు ఓట్లను పండించే శక్తుంటే ఎంత బాగుండేదిరా *

*(వార్త, సృష్టి; 07.12.1996)*

## గుండె తుడుం మోగాలి

నీ పదాల నీలిమంటల వెలుతురులో
ఒక పాడుబడ్డ గోపురాన్ని చూశాను
ఆశలు తీరని ఏ పూర్వీకుల ఊపిరులో
ముసురులో తడిసిన పావురాల
కునారింతల పాటై అల్లల్లాడడం చూశాను

పరాజితుడా
క్షతగాత్రుడివై తలవంచుకు నువు నడచిపోతోంటే
విజేతల వెకిలినవ్వుల కరతాళ ధ్వానాలు విన్నాను
నీ పలవరింతలు విన్నాను
షరా మామూళ్ళ వెన్నుపోట్ల విద్రోహాల
భయకంపిత చలన విన్యాసాల ప్రగల్భాలు విన్నాను

భ్రమలేవీ అక్కరలేదు
ఏ రెడీమేడ్ ప్రవాహాలూ లేవు
ఆరోపణలూ అవసరం లేదు
అడుగు అడుగూ మనమే బాటలేసుకోవాలి
ఈ సజల నేత్రాలకింత ధిక్కారం కావాలి
ఇప్పుడు పాట కావాలి పాట

గాయపడ్డ చిరుతపులి ఆర్తనాదమో
శంఖువు పూరించే సమర సంరంభమో
పాట కావాలి గుండె తుడుం మోగాలి
పరాజితుడా ఒక మాట కావాలి *

*(రచన కాలం 1997, అసంపూర్ణం, రాతప్రతి ఆధారం)*

## బాబా అంబేద్కరా!

నిప్పుల వ్యాకరణాన్ని
పంటి బిగువున నిలువరించలేను
అరచేతుల్లో రాజుకొనే ఆగ్రహాన్ని
ఆశ నిరాశల ఊగిసలాటలో ఉరితియ్యలేను
క్షమించు బాబా!
నిన్ను 'విగ్రహ మహాత్ము'డి గానే ఊహించలేను

గడ్డకట్టుకుపోయిన చీకటి విలువలను
నీ సమతా వాక్కుల కిరణాలు
బిందువులు బిందువులుగా కరిగించడం తెలుసు
తమస్సమాధుల నుండి
నీ సజీవ చేతనా జ్యోతులు
జాతర జాతరగా కదలబారడం తెలుసు
ఏ కార్యశీలతనూ ప్రేరేపించని ఆవేదన
ఏ చలనాన్నీ ఆదేశించని ఆక్రోశ కాసారం
నీ బిగి పిడికిలి నినాదంతో
కనలి కనలి పదం పదంగా
సైనిక కవాతు చేయడం తెలుసు
క్షమించు బాబా!
నువు రగిలించిన ఆలోచనల్ని
రాయితీల దేబిరింపుల రాచకీయ కబేళాల్లో
నిస్సిగ్గుగా వేలాడదీయలేను

వడగాడ్పుల పగళ్ళను కడుపులోన దాచుకొన్న
అంటరాని రాత్రుళ్ళను చూడు

నెర్రెలు విచ్చిన చూపులతో
ఎదురుతెన్నులు కాచే
వెలివాడల గుండెల్ని చూడు

బాబా! నా అంబేద్కరా!
దుర్మార్గపు కౌటిల్య రాజ్యానికీ
సిగ్గులేనితనంతో కొనసాగే
రాజ్యానుకరణలకీ
గుండెల్లో మారుమోగే సింహగర్జనవై
రారా నా నాయినా
నా పెను చేతనా ప్రవాహమా!
గుర్రపు డెక్కల అవరోధాలను పెకలించివేస్తూ
రారా నా తండ్రీ
నా గుండెల్లోకీ నా గూడేల్లోకీ
ఒక్క నిలువలేనితనమై
స్తబ్దతను బద్దలు చేసే ఒక కుదుపువై
ఒక్క నిరంతర చలనమై... *

*(ఈనాటి ఏకలవ్య; జనవరి, ఫిబ్రవరి 1997)*

## FIRST ROAD TO POETS LODGE

*వొక రాత్రి సాగి కవిత్వమయ్యే వేళ*
*కొన్ని గొంతుల మధ్య తంత్రులన్నీ కలసి ఏకనాదాలాపన చేసే వేళ*
*చేతులంతా కలసి చూపుడు వేళ్ళని మొలిపించుకునే వేళ*
*ఆత్మల మధ్య పిశాచగానం యిది.*
*నిన్నలో బతికే వారికి అందులోనే బతకండని కసిగా శపిస్తూ...*
*కలేకూరి ప్రసాద్, గడియారం శ్రీవత్స, నామాడి శ్రీధర్, ఒమ్మి రమేష్‌బాబు,*
*తల్లావజ్ఝల శశిశేఖర్, పెద్ది రామారావ్ రాసిన సంయుక్త దీర్ఘకవిత యిది.*

భూమి రసాన్ని పీల్చి
వొక పువ్వు
        చెట్టయి విరిసింది

బాధ తుఫానయినప్పుడు
కూలిపోయే చెట్టు కూడా
        గొప్పగా కనిపిస్తుంది

వూరికే వెలుగివ్వమన్నాను
కానీ
గుండెల్నింతగా మండించమన్నానా?
        నేను జవాబుదారిని
        యీ వొక్కసారికీ నన్ను భరించండి!

నీ సౌఖ్యాన్ని
త్యాగం చెయ్యమని కోరను
నేను చాలా స్వార్థపరుణ్ణి

నా పని బతకడం కాదు

బతకమని చెప్పడం
బతకడమంటే చావొద్దని

లక్ష దుష్ట సమాసాల్ని
వాడుకున్నాం కానీ
వొక్క సంకర సమాసమైనా చేశామా?

వరాలేమీ మిగల్లేదు
శాపాలు తప్ప
నేను నిష్పూచీగా నిసిగ్గుగా స్టేట్‌కి వ్యతిరేకిని
నేను జవాబుదారిని
యీ వొక్కసారికీ నన్ను భరించండి!

సాక్షిని నేనిక్కడున్నాను
చరిత్ర వెనక్కి తిరగదు

కోకిలను నిదుర లేపకు పాట పాడుతుంది
అప్పుడు తప్పక వసంతం రావాల్సి వస్తుంది

నేను జాతి అంతరాత్మని కాదు
శతాబ్దాల నుండి
ఆశలు తీరని ప్రేతాన్ని
నేను... ప్రపంచమంతా అయ్యేదాకా
నా ఆశ తీరదు

పరపరాగ సంపర్కం తర్వాత
పువ్వులు ఆకర్షక పత్రాలు రాల్చుకోవడం
తెలుసు కానీ
భ్రమరం రెక్కలు కోల్పోవడం తెలీదు

విషాదం
అభినయించడానికి తప్ప
అనుభవించడానికి పనికిరాదు
నేను జవాబుదారిని
యీ వొక్కసారికీ నన్ను భరించండి!

వెదురుపొద చేరువన
అతను పాట కోసం ప్రతీక్షిస్తున్నాడు!

యిక్కడ...
తెలియంది యేమీలేదు
పెను ప్రమాదకారి వొకడు
కొన్ని రాత్రులకి
అతిథిగా వొచ్చి
రికామీగా
మనని వొదిలిపోతాడు

యిక నువ్వూ నేనూ మనమూ
నీడలకయినా నోచుకోని
నిడుపాటి చెట్ల నడుమ
అలా వూరకనే తిరుగుతూ వుంటే
అతని తప్పేమీ లేదు కదా!
నేను జవాబుదారిని
యీ వొక్కసారికీ నన్ను భరించండి!

శతాబ్దాల అపర్ణావస్థ మరియూ
మనల్ని పగలెల్లా ఆవరించిన ముసురు
మాయమయ్యాయి

నేలమాళిగలోంచి అతను అరుస్తున్నాడు...
"నా ప్రేమ ప్రమిదకి
చేతులు అడ్డం పెడతావా?"
ఆ పసిహృదయానికి లాల్‌సలామ్!

మగ్ధలీనా ప్రేమను నిరాకరించిన క్రీస్తు
శిలువెక్కాల్సి వచ్చింది

మైడియర్ వొజ్నెసెన్స్కీ!
నువ్వు అన్నావు కదా...
"జీవితం భస్మస్థలాల సమూహం" అని
దయచేసి వొప్పుకో...
భస్మంలోంచి లేచే వొక పక్షి వుంటుంది
అది మనల్ని మోక్షగాముల్ని చేస్తుంది
నేను జవాబుదారిని
యీ వొక్కసారికీ నన్ను భరించండి!

ప్రేమించువారు ధన్యులు!

స్వప్నానికీ
స్కలనానికీ మధ్య
వో జ్ఞాపకం హస్తప్రయోగం చేసుకుంటుంది

ప్రేమించువారు ధన్యులు
వారు విడిపోవుదురు!!
వోడిపోవడం కాదు
వోటమిని అంగీకరించడం గొప్ప

సూర్యాస్తమయమయ్యాక
పద్మం ముకుళిస్తుంది
భ్రమరం బందీ!

విముక్తికి పొద్దుపొడవాలి
భూతం భయపెడుతుంది
అది కానిదంతా జ్ఞానమే
నేను జవాబుదారిని
యీ వొక్కసారికీ నన్ను భరించండి!

ప్రమిద కింద నీడలో మేల్కొన్నాను
చీకటి పాదాల కింద
మూగవోయిన పిల్లనగోవి
చల్లారని పాటలతో పసివాడిపోయాను
రూపాయిల్ని కాల్చి
మట్టి రేణువులకి నమస్కరించాను
ప్రేమిస్తాను పువ్వుల్ని విసిరి మీ ప్రేమల్ని
దీపం మీద దీపంలా వెలిగే హస్తాలతో
కాలిపోతాను, బూడిదవుతాను
ఫీనిక్స్‌నై నిదుర లేస్తాను...
చెట్టునవుతాను...
పూలు పూలు పూలు పూలుగా
నేను జవాబుదారిని
యీ వొక్కసారికీ నన్ను భరించండి! *

*(వార్త, సృష్టి; 26.07.1997)*

## విలాస్ గోగ్రే

యీ నీరవ క్షణాల్లో వాడు మాత్రం
యింతకన్నా యేం చెయ్యగలడు
ఎన్నడూ చల్లారని
నిత్యాగ్ని గుండాన మలమలమాడీ
యేనాటికీ చావని శలభమై వచ్చినవాడు
నగ్నదేహమ్మీద
కలల ఎడారుల్ని కప్పుకొని వచ్చినవాడు
మీరెన్నడూ తరచి చూడని చీకటిలోకాల నుండి
శోకాల తంత్రుల్ని మీటుకుంటూ వచ్చినవాడు
అరాచకుడు అసురుడు
ఆదియునూ అంతమునూ లేనివాడు
తరాల పరాజితుడు వట్టి కవిమాత్రుడు
సకల ఆగ్రహాల్నీ హైజాక్ చేయగల
గుప్పెడు బూడిదగా మార్చగల
మహామహుల వుక్కు సందిట్లో
యెవరు మాత్రం యేమి చెయ్యగలరు

పవిత్ర ప్రేమికుల్లారా గులాబీ బుగ్గల్లారా
మహా నాయకుల్లారా శ్రీరామచంద్ర ప్రభువుల్లారా
రండి రండిక చెట్ల చాటు నుండి బయటికి
రండి యిక మీ ఆయుధమేదీ వాణ్ణి నిర్జించలేదు
గాయాలనే సహజాస్త్రాలుగా ధరించినవాడు
ఎంత గాయమైతే అంత శక్తిని పొందినవాడు
స్మృతుల్ని నిద్రలేపుకొన్నారు కదా

తాళపత్రాల దుమ్ము దులుపుకొన్నారు కదా
అన్ని ఆయుధాల్నీ సిద్ధం చేసి సర్వ సన్నద్ధులైనారు కదా

వాణ్ణి హత్య చేసే అవకాశాన్ని
మీకు మిగల్చనందుకు
వాణ్ణి క్షమించకండి
మట్టి మూలుగుల్లోంచి లేచి వచ్చే
వాడి ప్రాణవాయువుల కోసం
చెప్పుల దండల్నీ దిగదిడుపు కుండల్నీ సిద్ధం చేసుకోండి
వాడి నెత్తుట తడిసిన గడ్డమీద
వాడి కలలు పెంకులు పెంకులై పగిలిన గడ్డమీద
వాడు కునారిల్లుతోన్న తరమై మిగిలిన గడ్డమీద
మీ స్వర్ణోత్సవాల స్వేచ్ఛాగీతికల్ని రచించుకోండి
వాడి వోటమి ఖరారైన పోరాటానికి
వాణ్ణి శిశిరవనంగా విస్తరిల్లజేసిన పోరాటానికి
వసంతోత్సవాలు జరుపుకోండి

యిన్ని తరాల బతుకు తర్వాత
వట్టి చేతులైనా ఆయుధంగా మిగలనివాడు
మరణాన్ని శరాలుగా సంధించిపోయాడు
యే వుపశమనమూ లేక యే ఊరడింపూ లేక
గొలుసుల్ని తెంచుకొనే గుంజాటన తప్ప
యే ఉత్సాహమూ లేక
వూపిరి పీల్చే వొక్కొక్క శవానికీ
వెన్నున తగిలిన విద్రోహపు పోట్లను స్పృశిస్తున్నాడు
సజల నేత్రాల విరిసిన
నల్లటి నెత్తుటి జీరల్ని జెండాలుగా ఎగరేస్తున్నాడు

యీ గోజాడే గుండెల మధ్య
వాడు మాత్రం యేం చెయ్యగలడు
వట్టి కలమాత్రుడు
వాడికి సంతాప సభలు జరుపుకుంటూ
మహోపన్యాసాలు చేసుకొంటూ
సరే...
మీరు బతికిపోండి *

*(ఆంధ్రజ్యోతి, ఆదివారం; 17.08.1997)*

*(విలాస్ గోగ్రే మహారాష్ట్రకి చెందిన దళిత కవి, కళాకారుడు, కార్యకర్త. ఆనంద్ పట్వర్ధన్ Bombay Our City (1985), Jai Bhim Comrade (2011) డాక్యుమెంటరీల్లో ఆయన నటించాడు. 1997లో రమాబాయి నగర్ దళితుల హత్యలకు నిరసనగా గోగ్రే ఆత్మహత్య చేసుకొన్నాడు)*

## మళ్ళొక్క సారి

మీ నగరం నడిబొడ్డున
నా జాతి పారేసుకున్న చెప్పుల కోసం
మీరు గంపల్లో కెత్తి
పారబోసిన గాయాల కోసం
మళ్ళొక్క సారి
మీ నగరానికొస్తాను

గుర్రాల పదఘట్టనల కింద
నలిగి నలిగి
కునారిల్లుతోన్న ఆర్తనాదాల కోసం
ఆస్పత్రి కారిడార్లలో
రాలిపడిన కలల కోసం
రోడ్డు రోడ్డునా రికార్డయిన
ఎగశ్వాసల చప్పుళ్ళ కోసం
మీ నగరానికి మళ్ళీ వస్తాను

కులం కులానికీ తలారుల్ని సృష్టించి
నువు పొందిన నిశ్చింతల విశ్రాంతిని
గద్దనై ఎగరేసుకుపోతాను
మండుతున్న గుండె లయల్ని
నీ పొదరిళ్ళకు తగిలించి
మీ నిదుర దీపాన్ని ఆర్పేసిపోతాను
నల్లదేహాలను నిరసన జెండాలుగా ఎగరేసి
గాయాల దిగంబరత్వంతో
మీ స్వర్ణోత్సవ వేదికల మీదికి నడిచి వస్తాను

మీ హైటెక్ కంప్యూటర్ల
సచివాలయాల మీద
లాఠీల దెబ్బలతో పగిలిన
నా జాతి పాదాలతో
నెత్తుటి ముద్ర వేసి పోతాను

మళ్ళొక్క సారి
మీ నగరానికి నడచివస్తాను *

*(రచన కాలం 1997.*
*హైదరాబాద్‌లో మాల మహానాడు ప్రదర్శనపై పోలీసుదాడి నేపథ్యం. రాతప్రతి ఆధారం)*

## బహుశా మనది ఒక దేశం

శాపగ్రస్త చావు శోకాలను తప్ప
వీరమరణాల విజయగాథల్ని పాడలేనందుకు క్షమించకండి
మంచు తుషారాల్లో తడిసిన
అరవిచ్చిన గులాబీల అంజలులు లేక
కథక్ కవాతుల గౌరవ వందనాలు లేక
ప్రజాకవి గొంతున రవళించే పరిపరి దండమైనా లేక
నలుగురు చేరి నవ్వుకొనే వేళ చెప్పుకొనే విశేషమైనా కాక
గర్భమూ మిగలక శోకమూ మిగలక కడకు తల్లయినా మిగలక
కుదురుకు కుదురే తరలిపోతున్న వాళ్ళను గురించి...

దేశమంతా
పుంజీడు చొరబాటుదారుల్ని తరిమికొట్టే పనిలో
అశువులు బాసిన వీరజవానుల స్మృతిలో
అశ్రునివాళై మోకరిల్లే వేళ
గుండెల్ని దేవేయడం తప్ప
ఏ ఉద్విగ్నతనీ కలిగించని
రోగిష్టి చావుల ప్రస్తావన చేస్తున్నందుకు క్షమించకండి
బతుకు లోలోపల్లోకి
ఎంతగా వాస్తవాధీన రేఖలు చొచ్చుకు వచ్చాయో
తెలియనైనా తెలియక గుండెలు పగిలి చస్తున్న వాళ్ళను
మర్చిపొండి

మీ దేశం గర్వించడానికొక
సంస్కృతినిచ్చి చరిత్రనిచ్చి వారసత్వాన్నిచ్చి
అడుగడుగునా తమ ఉనికే ఒక వెక్కిరింతై నిలిచే

జాతిమూలాలు కదలిపోతున్నందుకు
యిప్పుడు విజయగీతికలు పాడుకోండి

ఆకలి కడుపులు తప్ప
సకల రోగాల్నీ ఆకర్షించే దిక్కుమాలిన దేహాలు తప్ప
ఏ దేశభక్తీ లేని దౌర్భాగ్యపు చావుల్ని కసిదీరా శపించండి
చచ్చిన తొండల్ని గుండెల్లో పాతిపెట్టుకోండి
మా అందరి ముఖానా ఒక తెల్లగుడ్డ కప్పండి
యిక మొదలుపెట్టండీ
మీ తప్పట్లతాళాల కేరింతల్ని
ప్రేరేపించే ప్రేలాపనల్ని ఉపన్యాసాల్ని
మాకెంత ధన్యత ఎంత భావప్రాప్తి...

కొడుకా వాళ్ళు చచ్చిపోతున్నార్రా
ఎక్కడా అలమటింపు వద్దు
ఏ గుండే కలుక్కుమనవద్దు

మనది బహుశా ఒక దేశం
మనం బహుశా మనుషులం
మనం బహుశా సజీవులం *

*(వార్త, ఆదివారం; 25.07.1999)*

*(సరిహద్దు యుద్ధంలో మరణించిన వారికన్నా కొన్ని నెలల్లో ఏజెన్సీలో జబ్బుల పాలై మరణించిన ఆదివాసులు ఎక్కువన్న వాస్తవం తెలిసి)*

# హృదయ చాలనమ్

నిండు చందమామా, ముసలి తాపసీ,
లోగిలి లోపల మత్తిల్లిన మసక వెలుతురూ
చీకటిని గుప్పెడు బూడిదగా కాల్చేసే మండుతున్న గుండెకాయా
కనురెప్పల కాపలా కనుగప్పి రేకలు రేకలుగా కురిసే కలల వానా
బతుకునిండా రక్షణసైన్యమై మోహరించిన గాయాల సమూహమూ
క్షణం క్షణం శక్తినిచ్చే కన్నీటి ధారల మిగులు నిలువా
అన్నీ అండా దండా తోడూ నీడా...

ప్రియతమా!
రెపరెప చూపుల దీపాలూ మనమే
అరచేతుల రక్షక పత్రాలూ మనమే అయిన చోట
బతుకు మెడమీద కాడి కావొద్దు

భవిష్యత్తు మారేదేమీ లేదు
అదొక నిత్యసుందర స్వప్నం
చరిత్రే బైరూపుల దయ్యమై
క్షణానికో రూపమెత్తి వెంటాడు వేటాడు వేటకత్తి
నిన్నటి త్యాగాల వీరపూజ ఇవ్వేళ పొంచివున్న ఉరికంబం
లిప్త క్రితపు సాహసి వర్తమానానికో చంపదగ్గ కురూపి
జలతరంగణీ స్వరలహరై అలరించిన చిరునవ్వు
యిప్పుడొక దురదగుండ

జరపైలం కొడుకో...
ప్రతి అడుక్కీ ఎదురుపడే న్యాయమూర్తులు తీర్పులు చెపుతారు
బహుపరాక్

‘ఇచ్చుట అందముగా అంచనాలు కట్టి ప్రకటించబడును’
దారిపొడవునా విస్తరించిన గురువింద వనం

ప్రియతమా!
కణకణమండే నిప్పుకణికలూ మనమే
శీతల నవనీతాలూ మనమే కావలసిన చోట
కాలం కనుబొమల మధ్య
పాతుకున్న అసహనాల కట్టుగొయ్యి కావద్దు

పలుకరింపుల నొసళ్ళని వెక్కిరించనీ
ధృతరాష్ట్ర కౌగిళ్ళు పలుకరించనీ
ఆశలు చెదిరి అడుగులు తడబడి గుండెలు కలుక్కుమనే వేళ
నన్నే తలచుకో...

వెలివేతల పొలిమేరల నుండి విద్రోహాల రక్తక్షేత్రాల నుండి
ఒక నులివెచ్చటి కన్నీటి చుక్కై స్పృశిస్తాను
నీ సకల శకలాలనూ అపురూపంగా హత్తుకొనే
ఒక నల్లని కలనై ఆవరిస్తాను... *

*(యువకకి ప్రేమతో)*

*(వార్త, ఆదివారం; 24.10.1999)*

## బిగిసిన పిడికిట్లో

విశ్వాసాల గోపురాలన్నీ
కూలిపోయాక
యిక భ్రమలేమీ మిగలలేదు
నువు ఎగజిమ్మిన విషపు జ్వాలలు
దహించేస్తూనే వున్నాయి
కలల్నీ కల్లోలిత జీవితాల్నీ

'అల్లా! యీ చేతులు
కేవలం నమాజు చేయడానికేనా!'
క్షుభిత హృదయం ఆక్రోశిస్తున్నది
నెత్తుటి మడుగుల్లో తెగిన చేతివేళ్ళు
పిడికిళ్ళై బిగుసుకొంటూనే వున్నాయి

ఏకలవ్యుడి బొటనవేలూ
సున్తీ చేసిన మొండికత్తీ
బిగిసిన పిడికిట్లో... *

*(బహుజన కెరటాలు; డిసెంబర్ 2003)*

# సరికొత్త ఉదయం కోసం

అదే దుఃఖం
అదే ఆగ్రహం
అదే నిరాశా నిస్పృహల నీరవ ప్రపంచం
గాయమెప్పుడూ మౌనంగా ఉండదు కదా!
నెత్తుటికణాల కీకారణ్యాలలో
కుంపటులు రాజేస్తుంది

ప్రియతమా!
ఇప్పుడు నీ పాట
గాయపడ్డ చిరుతపులి ఆర్తనాదం కావాలి
తండ్రీ!
ఈ దేశానికి ఈ ప్రపంచానికి
ఒక కొత్త సూరీడు కావాలి

మళ్ళొక్కసారి రారా
ఒక సరికొత్త ఉదయం కోసం
కొత్త స్వప్నం కోసం
సరికొత్త రాగం కోసం
కొత్త ప్రపంచం కోసం *

*(బహుజన కెరటాలు; మార్చి, ఏప్రిల్ 2004)*

## సుషమా

వైధవ్యం శాపమేమీ కాదు
నల్లరేగళ్ళ నిండా రాలిన నల్లపూసల సాక్షిగా
తెగిన పుస్తెలతో నిలబడ్డ
రైతుల భార్యల విధవత్వాన్ని మోస్తున్నావా...

కులమతాల కుత్సితాల కరాళ తాండవంలో
ఒరిగిన పల్లెవీరుల కోసం సౌభాగ్యాన్ని చెరిపేసుకున్నావా...

యీ దేశాన్ని మట్టి చేతులతో మలచి
మూపులపై భరించే భర్తలు దళిత ఆదివాసీ సమూహాలను
మరణశయ్యలకంపి సుమంగళత్వాన్ని త్యజించావా?

సుషమా...
నీ భర్త త్రిశూలం
నీ భర్త కాషాయం
నీ భర్త హిందూత్వం
మరణించే గడియ ఎంతో దూరం లేదు
మంచిదే ముందే సిద్ధపడు! *

*(బహుజన కెరటాలు; జూన్ 2004)*

*(సోనియా గాంధీ ప్రధాని అయితే తెల్లచీర కట్టుకొని, గుండు గీయించుకుంటానని భారతీయ జనతా పార్టీ నేత సుష్మా స్వరాజ్ ప్రకటించిన సందర్భం)*

## యిప్పుడొక పాట కావాలి

మూడో పెగ్గులోనో నాలుగో పెగ్గులోనో
గుండెలు కలుక్కుమని
పదే పదే నువ్వే గురుతుకొస్తున్నావు

కనురెప్పల మీంచి ఆకాశంలోకి
ఒక నల్ల సీతాకోకచిలుకల దండు
గోసిగాళ్ళ గొంగడీ జెండాలాగా ఎగురుతోంది

ఏడేడు రంగుల సింగిడీ తీగెల పూల సజ్జలు
పాదాలకు అల్లుకొని
జజ్జనకరి జనారే జాతరే జాతర

మొగ్గ తొడిగిన ఒక ధిక్కార గీతం
నేల నేలంతా పరుచుకున్న పుచ్చపువ్వుల తీగె
నా పూర్వీకుడు ఆలపించిన ఒక పురాగానం
గుండెల్ని దుఃఖాగ్రహంతో అలుముకొంటోంది

నా దేముడా తండ్రీ నా తల్లీ
సింహాలు తమ చరిత్రను తాము చెప్పుకోకపోతే
వేటగాళ్ళు చెప్పే పిట్టకతలూ కట్టుకతలే
చరిత్రగా చలామణీ అవుతాయి'
యిప్పుడు నీ గొంతుక నుంచి ఒక కొత్త పాట కావాలి
దేహాన్ని దున్నీ దున్నీ గుండెల్ని చిలికీ చిలికీ
గుప్పెడు పదాల గింజల్ని పండించి
పావురాలుగా ఎగరేసినట్లు

నీ మట్టి పుట్టుక నుంచి నీ అగ్నిగొంతుక నుంచి
ఒక పాట కావాలి
దేశం కనురెప్పల కింద పేరుకొంటున్న
చిక్కటి కొత్త కలలాంటి పాట కావాలి

యింకా మాట్లాడలేను చాతనైత లేదు
నీ వెన్నులో దిగబడిన తూటా రంగు
మగత నిద్రలాగా కళ్ళలోకి పొడుచుకొస్తోంది
యింక నిద్రపోవాలి
ని...ద్దు...ర...పో...వా...లి
పొద్దున్నే లేవడానికి
ఒక కొత్త సూరీడ్ని చూడడానికి
పగటి వెలుతురులో నిన్ను పలుకరించడానికి
నీ మువ్వల పాదాలపైన ముద్దు పెట్టడానికి *

*(విశ్వకవి గాయకుడు గద్దర్‌కు గౌరవంగా)*

*(ఆంధ్రజ్యోతి, ఆదివారం; 10.07.2005)*

## అమ్మా! అంబేద్కరా...

కాగితాల పైనే కాదు
పుస్తకాలలోనే కాదు
పక్కటెముకల కింద ప్రవహించే
జీవనదుల పైనా
నీ పేరు రాసుకుంటాము
కనురెప్పల కింద విచ్చుకొనే
పువ్వుల్లాంటి ఆకాంక్షల పైనా
నీ పేరే రాసుకుంటాము
సజీవ దహనమైన దళితపల్లెల
బూడిదలోంచి ఎగిరి వచ్చే ఫీనిక్స్ పక్షి
కంఠనాళాల పైనా నీ పేరే రాసుకొంటాము
నీ పురుటి నొప్పులతో రాజ్యాంగాన్నే కాదు
తరాల స్వప్నాల్ని ప్రసవించావు

జాతికి నువ్వు తండ్రివా! తల్లివా!
కోట్ల కోట్ల జనం దుఃఖితులైన జనం
అన్నార్తులైన జనం అంగలార్చే జనం
అణగారిన జనం కునారిల్లే జనం
ఆకాశంలో ఎగిరే పక్షుల రెక్కల పైన
యిప్పుడు నీ పేరే చదువుకొంటున్నారు
నీలో అమ్మతనాన్ని చూసుకొంటున్నారు
తెరుచుకున్న కిటికీ కటకటాల్లోంచి ప్రసరించిన
తెలి తెలి రేఖల సూర్యకిరణం
పగులగొట్టింది

కన్నీటి బుడగనో మంచు తుషారాన్నో
ఆవిష్కృతమైన ఏడురంగుల ఇంద్రధనస్సు రెక్కల పైనా
నీ చిరునవ్వుల రూపం
పెదవుల పైన హక్కులకు హామీ యిచ్చిన
నీ చిరు చిరు నవ్వుల సంతకం

తండ్రీ! తల్లీ! దేముడా!
దేశమంతా నిద్రపోయేవేళ
నువ్వు కళ్ళు తెరచి కలలెందుకు కన్నావు
తరం నుండి తరానికి అందుతున్న
అవమానాల దుఃఖపు నదుల్ని నీలోనే యింకించుకొని
దేహాన్నంతటినీ ఒక అల్పపీడన ద్రోణిని చేసి
ముసురు ముసురుగా ఎందుకంత కుమిలిపోయావు
కనలిపోయావు ఎందుకంతంతగా కంకటిల్లిపోయావు?
గుండెల్లో తుఫానులు చెలరేగుతుంటే
కళ్ళెందుకు కణ కణ నిప్పులు కురిశాయి?

నీ అర్ధ నిమీలిత నేత్రాల ముందు సాగిలపడి
గుప్పెడు గుండెంత బతుకును కోరుకున్నాము
నగరం నడిబొడ్డులోంచి మొలుచుకొచ్చిన
ధవళకాంతుల మహావృక్షంలా సాక్షాత్కరించి
ఒక చూపుడు వేలునిచ్చావు
అది చూపే ఒక సూర్యోదయాన్నిచ్చావు
పార్లమెంటునో అసెంబ్లీలనో మాత్రమే కాదు
మనుష్యుల హృదయాలనే జయించి పాలించే
ఒక సందేశాన్నిచ్చావు
ఒక కాంతిఖడ్గాన్నిచ్చావు

అవునూ!
నీ పేరు స్వేచ్ఛా? సమానత్వమా? సౌభ్రాతృత్వమా?
తల్లీ!
ఈ భూమి గర్భం పైన నీ పేరే రాసుకొంటాము
అది జన్మనిచ్చే మరుసటి తరం
నీ పేరును ధరించి ఏపుగా ఎదుగుతుంది *

*(బహుజన కెరటాలు; ఏప్రిల్ 2008)*

## నువ్వే నేను

(తెలం'గానం')

మునేటి వంక దగ్గరో
జోదు చింతల మలుపులోనో
నువ్వు నాకు ఎదురుపడ్డ జ్ఞాపకం
అప్పుడు నీ కళ్ళనిండా నీళ్ళు
నిన్ను గుర్తే పట్టలేదు

గొరికొయ్యలు పొడిచినప్పుడో
తెలిమబ్బులు విరిసినప్పుడో
నువ్వు మా గుడిసె కొచ్చినట్టు జ్ఞాపకం
అప్పుడు నేను ఆవురావురుమంటూ
ఆకల్ని భోంచేస్తున్నాను
నిన్ను నేను చూడనే లేదు

ఎవరి అసహనమో
ఎవరి ఆగ్రహమో
జంటపేగుల మధ్యన
కనిపించని కలుషిత రేఖల్ని గీసింది

రాజమార్గాన మారాజులా
నడిచిపోవాలన్న తరాల పిచ్చికోరిక
దింపుదు కల్లం దగ్గర చిల్లరగా
గలగలా జారిపోయింది

ఎందరు కుప్పకూలిపోయారు!
ఎందరు నలిగిపోయారు?

కనురెప్పల కింద
గాయాల సుడిగుండాల్లో పడి
తన్నుకులాడుతూ
నీ సంగతే పట్టించుకోలేదు

నన్ను ఊరవతలకి నెట్టి
కలల్ని రక్తసిక్తం చేసిన
ఆ వామనుడి మూడోపాదం మోపింది
నీ శిరస్సుపైనే

నంగిమాటలు లేవు
భూమిని పెకలించుకొని
శిరసెత్తి నిలబడు
చెంగనాలు తొక్కు
తాండవమాడు
ఆడినా పోరాడినా ఓడినా
నీది ధర్మపోరాటం
నీ రణక్షేత్రానికి
నా శ్వాసను కాపలాగా పెడుతున్నాను
హద్దులే ఏర్పడతాయో
సరిహద్దులు లేని మానవీయ పరిమళాలే వ్యాపిస్తాయో
కదం తొక్కు కదం తొక్కు
నీ నడకల తాళానికి దొంగల కోటలు బీటలు వారాలి
ఆకాశం చిరిగి జలధారలు కురవాలి
పగిలిన నీ పెదవుల పైన
చిరునవ్వుల పువ్వులు పూయాలి *

*(కావడి కుండలు, సీమాంధ్ర కవుల తెలం'గానం'; ఆగస్ట్ 2010)*

## ముఖచిత్రం

నీ ధ్వంస రచనకు కూలిపోయే
విగ్రహ మహాత్ముడు కాడతను
నువ్వు కళ్ళెర్ర జేస్తే కాలిపోయే
రాజ్యాంగ చిత్తుప్రతి పుటలు కాదతను
కోటానుకోట్ల హృదయాల్లో
రగులుతున్న వెలుగు జ్యోతిని
ఆర్పేయాలనుకున్నావు
ఊదీ ఊదీ మీ ఊపిరితిత్తులు
చివికిపోతాయేమో గానీ
ఆ ప్రపంచ ఉదయభానుడి
పాదాల చెంత ఉన్న
చిన్న పూరేకులనైనా కదల్చలేవు

ఒకానొక కారడవి
అడవిలోన మనిషితనాన్ని కోల్పోయిన
మృగప్రాయపు మనుషుల కోసం
బీళ్ళను ఊళ్ళను చేసిన
అపర బోధిసత్త్వుడతడు
మండుతున్న గాయాలకు
ఒక శీతల నవనీతం
మంచులో కరుడుగట్టిన
పాషాణ హృదయాలకు
ఒక పెనుమంటల పెనుగులాట

ఇకనైనా మనుషులుగా బతకండిరా! అని
మనసారా శపించిన మానవతామూర్తి

*  *  *

రాళ్ళ దెబ్బలు తిని
మీ కోసం పూలదండై వచ్చాడు
మీరతని మీదికి చెప్పులు విసిరారు
కొమ్ముల కోరల క్రూరమృగాలై
చెలగాటాల సంచారులైన వారికి
సమత, మమత, మానవతా కుసుమాల
పరిమళాన్ని పంచినవాడు
కూలగొట్టండి... నాశనం చేయండి
మీ ఉలికిపాటు తెలుస్తుంది
ఆ నడక రాతిబొమ్మల్లో లేదు
మా గుండెల్లో ఉంది

ఈ దేశానికి రామాయణం కావలసివచ్చింది
అందుకు బోయవాడైన వాల్మీకి మాత్రమే నిలిచాడు
ఈ దేశానికి ఒక మహాభారతం కావాల్సివచ్చింది
అందుకు అనార్యుడైన వేదవ్యాసుడు కావాల్సివచ్చింది
ఈ దేశానికి ఒక రాజ్యాంగం కావాల్సివచ్చింది
అందుకు
దళితుడైన డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ కావాల్సివచ్చింది

ఎవరినీ క్షమించవద్దు...కాల్చండి...కూల్చండి
మీరు శిథిలం చేసిన సౌధాల బీటల నుండి
చిరునవ్వుల గడ్డిపువ్వు ఒకటి

నవ్వుల పలకరింపై వికసిస్తుంది చూడు
అదే డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్

కంటిమీద కునుకు లేదు
కడుపుకింత తిండి లేదు
విరామం లేదు విశ్రాంతి లేదు
బోధించు, సంఘటిత పర్చు, పోరాడు

విగ్రహమంటే... అంబేద్కర్ విగ్రహమంటే
ఈ చైతన్యమాలా జ్వాలాతోరణం
నువ్వు విరగ్గొట్టిన చోట కారడవై విస్తరిస్తుంది
నువ్వు కాలబెట్టిన చోట పసిపాపల చిరునవ్వై వికసిస్తుంది
ఈ దేశానికి,
మీతో సహా మనుషులందరికీ
మంచి మాత్రమే జరగాలని ఆకాంక్షించే
ఒక మహోన్నత స్వప్నమై విరాజిల్లుతుంది

మీకు చేతనైతే...
నా శవాన్ని ఈ దేశం ముఖచిత్రంగా ముద్రించండి
ఒక జీవన రవళిని వినిపించే వెదురు వనాన్నై వికసిస్తాను

ఏది నాయనా! మొదలుపెట్టండి మీ వీరంగం
పరమ శాంతిని మాత్రమే కోరే బౌద్ధ బిక్షువులు ఉన్నారు
దళిత బహుజన సమూహాలున్నాయి...
ఖబడ్దార్ *

*(నువ్వే లేకపోతే, అంబేద్కర్ విగ్రహ విధ్వంస*
*నిరసన కవిత్వ సంకలనం; జూన్ 2012)*

## అతనొక నిబద్ధ వజ్రాక్షరం

అతనొక నిబద్ధ వజ్రాక్షరం
అవసరానికి కర్తవ్యానికి సంధి కుదరని చోట
విరిసిన నిప్పుల కొలిమి
లోకమంతా
ఒక జ్వరపీడిత గ్రహం లాగ మారిపోయినప్పుడు
ఆప్యాయంగా అక్కున చేర్చుకున్న స్నేహహస్తం

అతనికి పెద్ద పెద్ద మాటలు తెలియవు
తెలిసిన మాటలకు సందులు సమాసాలు అవసరం లేదు
అతని భాషంతా ప్రేమ అభిమానం
ఇంతటి సౌమ్యుడు
అరివీర భయంకరుడైన విప్లవ నాయకుడా!
అని నేను పదే పదే ఆశ్చర్యపోతుంటే
సత్యమూర్తి గారు
ఆయనలోని సైన్యాధ్యక్ష లక్షణాల్ని తెలిపాడు

సాదా సీదాగా వుండి మనుషుల్ని ప్రేమిస్తూ
శత్రువులకు, ప్రజాకంతకులకు పక్కలో బల్లెమయి జీవించిన
దాసరి అంకమ్మకు (బాంబుల అంకమ్మకు) మరణము లేదు *

*(బహుజన కెరటాలు; డిసెంబర్ 2012)*

*(బాంబుల అంకమ్మగా, కె.జి.సత్యమూర్తి సహచరుడిగా సుపరిచితుడు. ఆయన స్వస్థలం ప్రకాశం జిల్లా కొరిశపాడు మండలం రావినూతల. గ్రామీణ పేదల సంఘం మొదలుకొని విప్లవోద్యమంలో, దళిత బహుజనోద్యమంలో క్రియాశీలకంగా పాల్గొన్నాడు. 26 నవంబర్ 2012న అంకమ్మ అనారోగ్యంతో కనుమూశాడు)*

## గోరటి ఎంకన్న గోరటి ఎంకన్న

పల్లెలు కన్నీరు పెడుతుంటే
గుండెలకు హత్తుకొని
ఓదార్పు గీతాన్నాలపిస్తాడు
'నా పల్లె అందాలు చూసితె కనువిందురో'
అంటూ పరవశించిపోతాడు
అతడే
ఒకే ఒక సమష్టి స్వప్నం
ఒక ముక్తకంఠ గానం
గోరటి ఎంకన్న
గోరటి ఎంకన్న

అందరి దుఃఖాన్నీ అందరి అదృష్టాన్నీ
తన గొంతులో పలికించినవాడు
'రేలా దూలా తలెల్యాడే నేలల కోసం'
తపించి తపించి
తన దేహాన్ని మొత్తాన్నీ పాటగా మలచినవాడు
ఒక మానవతా రూపం
ఒక స్నేహహస్తం
గోరటి ఎంకన్న
గోరటి ఎంకన్న *

*(రాతప్రతి ఆధారం)*

# కోబలి

నీ మూడో పాదం మోపడానికి
నేనిప్పుడు శిరస్సును అవనతం చేసిలేను
పాతాళాన పాదాలు మోపి
చేతుల్ని జెండాల్లాగా
ఆకాశంలోకి ఎగరేస్తున్నాను

నాకిప్పుడు
నువ్వు కాజేసిన నా భూమి కావాలి
నువ్వు కాటేసిన నా వాళ్ళు కావాలి
నువ్వు కాల్చేసిన నా ఒళ్ళు కావాలి
నువ్వు కూల్చేసిన నా ఇళ్ళు కావాలి
నువ్వు పెరికేసిన నా కళ్ళు కావాలి

శరీర విన్యాసాలు చేస్తున్న ఓ వామనుడా!
మొత్తంగా నాకు నా బతుకు కావాలి
దేబిరించి అడుక్కునేదేమీ లేదు
బరిగీసి నిలబడ్డవాణ్ణి
ఆడినా! ఓడినా! పోరాడినా
గుండెకొలిమిలో సమరనాదమై
రగులుతున్న వాణ్ణి

రా! రా! రా!
నీ ఎత్తుకు నిన్ను సాగదీసి
సరైన కొలతలతో సమాధి చేసేందుకు
నా వాళ్ళు సిద్ధంగా ఉన్నారు

వామనుడా!
నీ కోసం శాశ్వతంగా సమరగీతం పాడేందుకు
నేనూ నా వాళ్ళూ పొలిమేరలు దాటి
ఊరి నడిబొడ్డుకు నడుచుకుంటూ
ఊరేగించి వస్తున్నాము! *

*(లక్షింపేట సంఘటన నేపథ్యం, రచన కాలం 2012, రాతప్రతి ఆధారం)*

## బహుశా ఇది పరీక్షా సమయం

ఊరకే
ఉరికురికిపోవాలని ఉబలాటమేమీ లేదు
అట్లని నిలబడ్డ చోటనే నుంచోని
మీనమేషాలు లెక్కబెట్టాలనీ లేదు
ఒక సాంద్రసంకేతాన్ని అరచేతిలో పట్టుకొని
సూర్యుడు వైపు నడుస్తున్నాను
బహుశా ఇది పరీక్షా సమయం
కాని ఏ జీవనమోహాలు ఆటంకాలు
అవరోధాలు వస్తే రానియి
బలహీనుడినే కాని స్థిరచిత్తుడను

హృదయం మెదడు
పదునెక్కిన ఖడ్గంలా వున్నాయి
కళ్ళముందు అనేకనేక బీభత్సదృశ్యాలు
సహించలేని క్రూర అకృత్యాలు
వీటిమధ్య నుంచి మళ్ళొక్కసారి
సమాధుల పగుళ్ళలోంచి
మొలుచుకొచ్చిన గడ్డిపువ్వులా
నీటిబుడగను పగలకొట్టి
ఇంద్రధనస్సు జెండాలెగరేసిన అక్షరాలను
ఆయుధాలుగా చేబూని వస్తున్నాను
నువ్వే నేను నేనే నువ్వు మనందరం... *

*(ఆఖరి కవిత, అసంపూర్ణం, రచన కాలం 2013, రాతప్రతి ఆధారం)*

బిపుల్ చక్రవర్తి

## మండే కన్నులు

ఒకదాని తరువాత ఒకటిగా
కన్నులు మండుతుంటాయి
దూరంగా నిలబడి గమనించు వాటిని
మిణుకు మిణుకు రాత్రి తారల్లా కన్పిస్తాయవి
దగ్గరకు రా
ఒక్కొక్క కన్నూ గోచరిస్తుంది
సూర్యునికన్నా పెద్దగా
నిప్పుల ముద్దగా *

*(అరుణతార; మే 1988)*

*(సుమంతా బెనర్జీ సంపాదకత్వంలోని Thema book of Naxalite Poetry నుంచి. బిపుల్ చక్రవర్తి బెంగాలీ కవి, గాయకుడు. జననం 1955. పలువురు బెంగాలీ కవులతో పాటు శంకర్‌గుహ నియోగి కవితల్ని కూడ ఆయన స్వరపరిచాడు)*

అర్కాడి కులెషోవ్

## కొండరావి చెట్టు

విషాదంగా, ఒంటరిగా శ్మశానపు కంచెను ఒరుసుకొని
అది దృఢంగా నిలబడి వుంటుంది
దాని బెరడు నిండా నాజీ ఫిరంగి గుండ్లు మచ్చలు చేసిపోతాయి
ఏదో అద్భుతం జరిగి జీవిస్తోన్న దానిలా, శోకతప్త బాలికలా
ఆ కసాయిసీమలో అది నిలబడి వుంటుంది

కొండరావీ! కన్నీరు పెట్టవద్దు, నిట్టూర్చవద్దు, వణకవద్దు
నీ ఊడలను నదీప్రవాహానికి ముడివేయి
నిన్ను శత్రువులు సంహరించలేరు
ఫలాల నివ్వమని నిన్ను బలవంతపెట్టలేరు

కొండరావీ! నువ్వు ఈ భూమిని ఆనందపరుస్తున్నట్లుగా
మానవ హృదయాలను ఆనందపర్చు
ఎదుగు కొండరావీ! ఎదుగు *

*(అరుణతార; డిసెంబర్ 1988, జనవరి 1989)*

*(రచన కాలం 1943. Let the Living Remember Soviet War Poetry నుంచి.*
*కులెషోవ్ 1914లో జన్మించాడు. బైలో రష్యన్ జాతికి చెందినవాడు. యుద్ధసమయంలో సైనిక వార్తాపత్రికలో పనిచేస్తున్నప్పుడు అతని రచనలు బైలో రష్యన్ పార్టీ యూనిట్లలో విస్తృత ప్రచారం పొందాయి. ఈ కవి యుద్ధ సేవా గౌరవాన్ని పొందడమే కాకుండా స్టేట్ ప్రైజ్ విన్నర్ కూడ)*

# నేరస్థుడు

అతను బందీగా వున్నా సరే... అతను నేరస్థుడు కాడు

అతను పరారీలో వున్నా సరే... అతను నేరస్థుడు కాడు

అసలు నేరస్థుడు వాడు... ఆ గద్దెమీద కూర్చున్నవాడు *

*(కామ్రేడ్స్ వరవరరావు, గద్దర్‌ల కోసం కలకత్తా ఎఐఎల్ఆర్‌సి
కవి సమ్మేళనంలో చదివిన హిందీ కవిత. కవి పేరు గుర్తులేదు)*

*(అరుణతార; ఫిబ్రవరి 1989)*

సబ్యసాచి దేవ్

## అమరుని మాతృమూర్తి

ఈ రాత్రికి మళ్ళీ వాళ్ళు వస్తారా!
దగ్గరలోనే ఎక్కడో
వాళ్ళు తాగి తందనాలాడే తుళ్ళింతల శబ్దం
నాకు వినిపిస్తున్నది
రోడ్డుకు ఆవలి వైపున
సుళ్ళు తిరిగి పైకి లేస్తోన్న నల్లటి పొగ
కాలిన చర్మపు కమురువాసనతో నిండిన గాలి

మళ్ళీ ఈ రాత్రికి వాళ్ళు వస్తారా?
నిదురపో నా కన్నా!
ఎండిన నీ నీలి పెదవుల నుండి
తెరచిన కమ్యూనిస్టు ప్రణాళిక పుటల మీదికి
నెత్తురిక ప్రవహించదు

తోడేసిన కనుగుడ్ల గుంటలలో
ఇక మిగిలేది ఘనీభవించిన విశాల స్వప్నమే
నిదురపో నా చిన్నా!
నీ పసితనపు రోజులలో లాగా గాఢంగా నిదుర పో
బయట కలకలం పెరుగుతున్నది
ఎవరినో వాళ్ళు రోడ్డుమీద
బయినెట్లతో పొడిచి చంపుతున్నారు
నాకు వినబడుతున్నది
వేరొక వైపున మరెవరినో

దీపస్తంభానికి కట్టేసి పెట్రోలు పోస్తున్నారు
పేరు తరువాత పేరు
పోలీస్ స్టేషన్ ముందు వేలాడదీసిన
కాగితపు చుట్టమీదికి ఎక్కుతున్నవి

నరాల్లో నెత్తురు కదలాడడం
నాకు వినిపించడం లేదు
నదీ తరంగాలు తీరానికి తాకే చప్పుడు
నాకు వినిపించడం లేదు
ఉన్నదల్లా గంగకు పోయే తోపుడుబళ్ళ వరుస
వాళ్ళు ఈ రాత్రికి మళ్ళీ వస్తున్నారు
మెట్లమీద వాళ్ళ అడుగుల చప్పుడు వినబడుతున్నది
నిదురపో నాన్నా!

కానీ నువ్వు తీసుకొని వచ్చిన తుపాకీ ఎక్కడున్నదో
ఒక్కమాట నా చెవిలో మెల్లగా చెప్పు
వాళ్ళు తలుపును బద్దలు కొడుతున్నారు
నాకు వినబడుతున్నది
ద్వారం తెరుచుకుంటున్నది
నేనున్నానుగా బాబూ! నువు నిదురపో
నీ తుపాకీ ఇప్పుడు నా ఒడిలో వున్నది
వాళ్ళు వచ్చేసారు...
అయినా నా బిడ్డా! నువు నిదురపో *

*(అరుణతార; మార్చి 1989)*

*(Protest, An Anthology of Bengali Poems of 70's నుంచి.
సబ్యసాచి దేవ్ బెంగాలీ కవి)*

అహ్మద్ ఫరాజ్

## ముందుమాట

పాత కథే:

పెదవులు పదాల్ని పలకాలనుకున్నప్పుడు

శబ్దంతో వాటికి ప్రాణస్పందన కలిగించాలనుకున్నప్పుడు

అవి గుక్కెడు విషాన్ని మింగవలసి వచ్చింది

పదాలు గళాలలో సజీవమైపోయి

ఒక కథై నిలిచిపోతాయేమోనని ప్రభువుల భయం

అందుకే పెదవుల్ని కుట్టేశారు

కానీ గజగజ వణికే పదాలు... నిట్టూర్పుల పదాలు

హంతక ఖడ్గంచే క్షతగాత్రమైన పదాలు

గుండెలో భయం భయంగా కొట్టాడుతూనే వున్నాయి

బొట్టుబొట్టుగా స్రవించే పదాల నెత్తురు

మిలమిల మెరిసే పంక్తులైపోతాయని ఎవరికి తెలుసు?

ఇప్పుడా నెత్తుటి పంక్తులన్నీ

వాటంతటవే ఒక కథై నిలిచిపోతాయి *

*(అరుణతార; అక్టోబర్, నవంబర్ 1989)*

*(అహ్మద్ ఫరాజ్ (1931–2008) ఉర్దూ కవి. మొట్టమొదట్లో రొమాంటిక్ గజళ్ళు; తర్వాత అభ్యుదయ, సోషలిస్టు భావాలతో కవిత్వం రాశాడు. పాకిస్తాన్ సైనిక నియంతృత్వ ప్రభుత్వాన్ని వ్యతిరేకించినందుకు అనేకసార్లు అరెస్టయ్యాడు. ప్రవాస జీవితమూ గడిపాడు)*

డేవిడ్ దియోప్

## ఆఫ్రికా! నా ఆఫ్రికా!

పురాతన గాథల్లోని గర్వించదగ్గ యోధుల్ని కన్న ఆఫ్రికా!
సుదూర నదీతీరాలలో మా బామ్మ పాడే పాటల్లో
ప్రతిఫలించే నా ఆఫ్రికా! ఆఫ్రికా!
నువ్వెలా వుంటావో నాకింత వరకూ తెలియనే తెలియదు

కానీ నా రక్తనాళాల్లో ప్రహించేది నీ నెత్తురే
పంటపొలాల నుండి పసిడిపంటల్ని పండించే
నీ చక్కని చిక్కని నల్లని నెత్తురే నీ చెమట నిండిన నెత్తురు
నీ శ్రమ ఓడ్చిన చెమట
నీ బానిసత్వం పొందిన శ్రమ
నీ పిల్లల పాలిటి బానిసత్వం
ఆఫ్రికా! నా ఆఫ్రికా! నాలో ప్రవహిస్తున్నది నీ నెత్తురే

చెప్పు ఆఫ్రికా చెప్పు
ఆ వంగిన నడుముతో వున్నది నువ్వే కదూ!
తరతరాల అణచివేతల బరువుకింద విరిగి నలిగిన నడుము
ఎర్రటి రక్తసిక్త గాయాలతో గజగజా వణికే నడుము
మధ్యాహ్నపు మండుటెండలో ఛళ్‌ఛళ్‌మనే కొరడా దెబ్బల్ని
మౌనంగా భరిస్తోన్న నడుము నీదే కదూ!
చెప్పు ఆఫ్రికా! నిజం చెప్పు

ఓ నీరసపు గొంతుక బదులు పలికింది...
కుపిత నేత్రాలతో ఉగ్రమహోగ్రుడవైన నా బిడ్డా!
అదుగో అక్కడుంది చూడు

దుర్భర ఒంటరితనంలో
తెల్లగా పాలిపోయిన పుష్పాలతో
దృఢంగా ఎదిగిన యువవృక్షం
అదే అదే నీ ఆఫ్రికా
....నిస్సత్తువ నుండి, నిర్లిప్తత నుండి
మొండిగా, ఓపికగా మళ్ళీ అది ఎదుగుతుంది
మెలమెల్లగా దాని ఫలాలు
వగరు వగరుగా స్వేచ్ఛారుచిని సంతరించుకుంటాయి *

*(అనుసృజన: నవత, యువక)*
*(అరుణతార; ఏప్రిల్ 1990)*

*(డేవిడ్ దియోప్ (1927–1960) ఫ్రెంచి పశ్చిమాఫ్రికా కవి. స్వతంత్ర ఆఫ్రికా కోసం స్వప్నించాడు. 33ఏళ్ళ వయసులో విమాన ప్రమాదంలో మృతిచెందాడు. ఆయన కవిత్వసంపుటం ఆంగ్లానువాదం Hammer Blows)*

శరణ్‌కుమార్ లింబాలే

## శ్వేతపత్రం

మీ ఆకాశాల్లో ఉదయించే
సూరీణ్ణి గానీ చంద్రుణ్ణి గానీ
నేను కోరుకోలేదు...
మీ సుందరసౌధాలనో, ఆకాశహర్మ్యాలనో
మీ పంటపొలాలనో, మీ యజ్ఞయాగాలనో
మీ దేవుళ్ళనో, మీ తెగలనో, కులాలనో
చివరకు మీ తల్లులనో, చెల్లెళ్ళనో, బిడ్డలనో
నేనెన్నడూ అడగనే లేదు

మనిషినై పుట్టినందుకు
నా మనిషితనపు హక్కుల్ని
అడుగుతున్నాను నేను
నా శ్వాసకోశాల నుండి వెలువడే
ప్రతి నిశ్వాసానికీ
మీ విశ్వాసాలూ, సంప్రదాయాలూ
స్వర్గాలూ, నరకాలూ గజగజా వణుకుతున్నాయి
అంటు తగులుతుందేమోనన్న భయం...

మా గుడిసెల్నీ గూడేలనూ
కూలగొట్టేందుకు
మీరందరూ ఒక్కటైపోతారు...
నన్ను బాధిస్తారు, భగ్నం చేస్తారు
నన్ను నిలువునా దగ్ధం చేస్తారు

కానీ... నా మిత్రులారా!
తూర్పున సూర్యుడిలా నాటిన నా మాటను
పిసరంతయినా కదపగలరా?

నా హక్కుల పోరు
నగరాల నుండి నగరాలకు, పల్లె నుండి పల్లెకు
మనిషి నుండి మనిషికి వ్యాపిస్తున్నది
నాకు నా హక్కులు కావాలి
కాదంటారా...!
మీ వేదాలనూ మతగ్రంథాలనూ
రైలుపట్టాల్ని పెకలించినట్లు పెకలించివేస్తాను
మీ నీతిమాలిన నీతి సూత్రాలను
సిటీబస్సుల్ని కాల్చేసినట్టు కాల్చేస్తాను
మిత్రులారా!
నా హక్కులు సూర్యుడిలా ఉదయిస్తున్నాయి
ఈ సూర్యోదయాన్ని మీరు కాదనగలరా? *

*(ఆంధ్రజ్యోతి, ఆదివారం; 18.09.1994)*

*(శరణ్‌కుమార్ లింబాలే మరాఠీ దళిత కవి, రచయిత, సాహిత్య విమర్శకుడు. జననం 1956. ఆయన ఆత్మకథ Akkarmashi (1984) ఆంగ్లంలోకి, పలు ప్రాంతీయ భాషల్లోకి అనువాదమైంది. 'అక్రమ సంతానం' పేరుతో తెలుగులోకి కూడ వచ్చింది. ఆయన Towards an Aesthetics of Dalit Literature (2004) విశిష్ట రచనగా ప్రాచుర్యం పొందింది)*

దయా పవార్

## ఓ మహాకవీ!

వాల్మీకీ!
నువు కవులకే కవివి కాబట్టి
మహాకవివి కాబట్టి
నువు రామరాజ్యపు
ఘనకీర్తినే గానం చెయ్యాలా?

నువ్వు పుట్టింది అంటరాని వెలివాడలోనే కదా!
నవ్వులెరుగక, పువ్వులెరుగక
విషాదం మూర్తీభవించిన ముఖాలు
బతుకులీడ్చే నికృష్టపు వాడలోనే కదా!
దుర్భర దారిద్ర్యమే
ఒక గుడిసెల సమూహంగా రూపొందినట్టు
అవమానాలతో నిలిచివుండే దళితవాడలోనే కదా!

నేల కూలిన క్రౌంచపక్షి గాయాలను చూసే
కరుణతో నిండిన నీ గుండె బద్దలై పోయిందే
మరి నిత్యమూ కష్టాలతో కన్నీళ్ళతో కునారిల్లే
నీ జాతి జనాల ఆకలి కేకల ఆర్తనాదాలూ,
గుండె గాయాలూ, శోక గీతాలూ
నిజంగా నీకు విన్పించనే లేదా?
నువు కీర్తించే రామరాజ్యంలోనే
నీకు పేగుబంధం, నీ నెత్తుటి బంధువు
శంబూకుడు నేల కూలిపోయాడు కదా

ఆ ప్రవహించిన నెత్తుటి జ్వాలల స్పర్శ
నిన్ను తాకనైనా లేదా?

అయితే ఓ మహాకవీ!
నిన్ను మహాకవని ఎలా పిలిచేది
నీ జాతి అవమానాల పైన
ఒక్కటంటే ఒక్క వాక్యం రాసినా
నీ పేరును మా గుండెల మీద చెక్కుకొనే వాళ్ళం
వాల్మీకీ!
నిన్ను మహాకవి అని పిలువలేను *

*(వార్త, సృష్టి; 26.10.1996)*

*(దయాపవార్ (1935–1996) మరాఠీ దళిత కవి, రచయిత. 1978లో వెలువడిన ఆయన Baluta మరాఠీ సాహిత్యంలో తొలి దళిత ఆత్మకథ. ఆధునిక భారతీయ సాహిత్యంలో ఉత్తమ రచనగా అనేక భాషల్లోకి అనువాదమైంది)*

ఎల్.ఎస్.రోకాడే

## ఒక జనన సందేహం

నన్ను కనేటప్పుడు
దుర్భరమైన ప్రసవ వేదనను
అనుభవించానని చెప్పే దానివి
అంతలేసి పురుటినొప్పులు
నీకెందుకొచ్చాయో తెలుసా అమ్మా?

నీ కడుపులో వుండగానే
నేను ఆలోచనలో పడ్డాను
ఈ గడ్డమీద
నేనసలు పుట్టాలా వద్దా అని
సందేహిస్తూనే గడిపాను

క్షితిజాంతరాల్లోకి దూసుకుపోయే దారులన్నీ
నా కోసం నిషిద్ధాలయ్యాయి
మీరంతా ఆకాశం వైపు చూపులు సారించి
ఆకాశానికో ఆధారముందని
కళ్ళు మూసుకు చెప్తారు

తరతరాల దారిద్ర్యాన్ని
దుప్పటిగా కప్పుకొని
నిరంతర అవసరాన్ని
తలదిండుగా చేసుకొని
రాత్రివేళ నువ్వు నిద్రపోతావు

ఖాళీ పిడికిళ్ళను
రొమ్ములకు కట్టేసుకొని
పగలంతా నువు మెలితిరిగిపోతావు

ప్రతి మనిషీ
స్త్రీ పురుషుల కలయికతోనే పుడతారని
ఇక్కడ ఎవరూ చెప్పలేరు
ధ్వంసమైన దారుల్ని విస్తృతపరిచేందుకు
ఇక్కడ ఎవరూ సాహసించలేరు
మీ చుట్టూ మీరు పరిభ్రమిస్తూ
భూమి గుండ్రం గానే వుందని
అచ్చెరువొందుతారు

అమ్మా!
గట్లు తెంచుకు ప్రవహించే జీవనదుల గడ్డ నీది
సుజలాలతో పొంగిపొరలే సరోవరాల సీమ నీది
నువు మాత్రం
దోసెడు నీళ్ళ కోసం
నిరంతరం పెనుగులాడుతూ
నెత్తురోడ్చువలసివచ్చే 'మనిషి'వి

అమ్మా!
ఈ మహా నాగరికత మీద
నేను ఖాండ్రించి ఉమ్మేస్తున్నాను
నువ్విక్కడే పుట్టినావని ఈ భూమి నీదా?
నేను నీకు పుట్టినానని అది నాదా?

ఈ కర్మభూమి నాదేననీ
దాన్ని ప్రేమించి దాని కీర్తిని గానం చెయ్యాలా?

క్షమించమ్మా
నిజం చెప్తున్నాను
ఈ భూమి మీద
అసలు నేను పుట్టాలా వద్దా అని
సందేహిస్తూనే వున్నాను *

*(అనువాద కాలం 1997, రాతప్రతి ఆధారం)*

*(ఎల్.ఎస్.రోకాడే మరాఠీ దళిత కవి. కవిత్వంలో పూర్వకవుల నమ్రతని తిరస్కరించాడు. సమరశీలతని ప్రవేశపెట్టాడు. ఆయన ప్రసిద్ధ కవిత 'To be or Not to be born'. దీనిలో తల్లితో పాటు తన మాతృభూమికీ 'అమ్మ'ని ప్రతీక చేశాడు)*

ఖలీల్ జిబ్రాన్

## జాలిపడాల్సిన జాతి

మంత్రగాళ్ళే తత్వవేత్తలుగా
గుంటనక్కలే మహా నాయకులుగా
అతుకులు, అనుకరణలే కళలుగా
పరిఢవిల్లే జాతిని చూసి
నా మిత్రులారా జాలిపడండి

కలల్లో చీదరించుకొనే కాంక్షలకే
మెలకువలో లొంగిపోయే జాతిని
పశుబలంతో విర్రవీగే వాణ్ణే
రారాజుగా కీర్తించి
విజేతల కిరీటపు ధగధగల్లో
సౌందర్యాన్ని తిలకించి పరవశించి
పాదాక్రాంతమయ్యే జాతిని చూసి
జాలిపడండి

శవయాత్రలో తప్ప గొంతెత్తలేని జాతిని
శిథిలాలలో తప్ప వైభవాలను చాటుకోలేని జాతిని
శిరస్సులు తెగిపడే
ప్రాణాంతక సందర్భాన తప్ప
తిరగబడలేని జాతిని చూసి
జాలిపడండి

తాను నేయని బట్టల్ని తొడిగి
షోకులెల్లే జాతిని

తాను పండించని పంటల్ని
తెగమెక్కే జాతిని
తను కాయని మధువుల్ని తాగి
తూగులాడే జాతిని చూసి
జాలిపడండి

మూఢ విశ్వాసాలు తప్ప
మతమే లేని జాతిని
జయ జయనాదాలతో
స్వాగతించినవాడినే చీత్కరించి
మరొకరిని నెత్తికెక్కించుకొని
కేరింతలు కొట్టే జాతిని చూసి
జాలిపడండి

తలపండిన విజ్ఞులంతా మూగవాళ్ళుగా
శక్తివంతులంతా ఊయలలో పసికందులుగా
మిగిలిపోయిన జాతిని చూసి
జాలిపడండి

శకలాలు శకలాలుగా విడిపోయి
ఒక్కొక్క శకలమే ఒక్కొక్క జాతిగా
చలామణీ అయ్యే జాతిని చూసి
నా మిత్రులారా  నా సహ యాత్రికులారా
జాలిపడండి *

*(అనుసృజన: సుధాకిరణ్, కలేకూరి ప్రసాద్)*
*(వార్త, సృష్టి; 21.06.1997)*

*(ఖలీల్ జిబ్రాన్ (1883–1931) లెబనీస్–అమెరికన్ కవి, రచయిత, చిత్రకారుడు, The Prophet మహాకావ్యకర్త)*

నామ్‌దేవ్ ధసాల్

## అంబేద్కర్ కోసం

ఒక పొద నుండి మరొక పొదకు ఎగిరివెళ్తూ
ఒక సరికొత్త ఆశావహ కాంతిరేఖల్ని
వెదజల్లుతూ సంచరించే సీతాకోకచిలుకవు నువ్వే
రైలుపట్టాల లాగా నేలంతా పరుచుకుంటూ విస్తరిస్తూ
విశ్వవిద్యాలయాల పునాదులు కుదిపేస్తున్నదీ నువ్వే
స్వేచ్ఛ నుండి స్వేచ్ఛలోకి ప్రవహించే మానవీయ గీతానివీ నువ్వే
పైరు పంటల పొలాల నుండి జనసమూహాల నుండి
నిరసన ఊరేగింపుల నుండి
ప్రజా పోరాటాల నుండి
మాలోకి నడచి వచ్చు
మా రథసారథిగా కదిలివచ్చు
ఒకే ఒక్కడివి నువ్వే బాబా సాహెబ్
మమ్మల్ని ఎన్నడూ ఎడబాయక మాతోనే వుండి
మా సంకెళ్ళను తెంచగల
ఏకైక వ్యక్తివి
నువ్వు మాత్రమే... నువ్వు మాత్రమే... *

*(బహుజన కెరటాలు; డిసెంబర్ 2003)*

*(నామ్‌దేవ్ ధసాల్ (1949–2014) మరాఠీ దళిత కవి, రచయిత, ఉద్యమకారుడు. అమెరికన్ బ్లాక్ పాంథర్ ఉద్యమంతో ప్రేరణ పొందాడు. మహారాష్ట్రలో కుల వివక్షకి వ్యతిరేకంగా 1972లో దళిత పాంథర్ ఉద్యమం నిర్మించాడు. ఆయన కవితల్ని దిలీప్ చిత్రే Namdeo Dhasal: Poet of the Underworld, Poems 1972-2006 పేరిట ఆంగ్లంలోకి అనువదించాడు. 2010లో ఎంపిక చేసిన ధసాల్ కవితలతో 'నవయాన' A Current of Blood ప్రచురించింది)*

పాబ్లో నెరూడా

## యిప్పుడింక నువ్వు నాకు స్వంతం

యిప్పుడింక నువ్వు నాకు స్వంతం
నా కలలో నీ స్వప్నాలతో సహా
విశ్రమించు

యిప్పుడింక
ప్రేమా, బాధా, పనీ
అన్నీ నిద్రపోవలసిందే
ఈ చీకటి రాత్రి
కనిపించని చక్రాల మీదుగా కదలిపోతుంది
నిద్రించే ఆకాశం లాగా పవిత్రంగా
నా పక్కనే వున్నావు నువ్వు
ప్రేమ మాత్రమే
నా కలల్లో నిద్రపోతుంది

నువ్వు వెళ్ళిపోతావు
కాల ప్రవాహాల కెరటాల మీదుగా
మనిద్దరం కలిసే వెళతాం
ఈ దోబూచులాటల నీడల గుండా
నాతో కలసి ఎవరూ పయనించరు
నువ్వు మాత్రమే
నిత్య హరితంగా...

నువ్వు నిత్య చందమామవి... నిత్య సూర్యకాంతివి
నీ చేతులు సుతిమెత్తని పిడికిళ్ళని తెరుచుకున్న వెంటనే
మృదువైన రేఖలు జారిపడ్డాయి
నీ కనురెప్పలు రెండు
బూడిద రంగు రెక్కల్లాగా అలా మూసుకొని వున్నాయి
ఈ రాతిరి... ఈ ప్రపంచం... ఈ గాలి...
తమ లక్ష్యాలను మార్చుకొన్నాయి
నువ్వు లేవు
నేను నీ కలగా మిగిలాను
కేవలం కలగా
కేవ...లం కలగా
అంతే మరేమీ కాదు *

*(బహుజన కెరటాలు; జూలై, ఆగస్ట్ 2004)*

*(పాబ్లో నెరూడా (1904–1973) చిలీ జాతీయ కవి, రాజకీయవేత్త,
నోబెల్ బహుమతి గ్రహీత)*

పాబ్లో నెరూడా

## మరణానందాలకు వారసత్వం వద్దు

ఒకవేళ నేను మరణిస్తే
నీ సమస్త శక్తుల్నీ కేంద్రీకరించి
పాలిపోయిన శీతలత్వాల నుండి
ఏ విధంగా నువ్వు మంటల్ని నిద్ర లేపావో
అదే విధంగా అదే శక్తితో నన్ను నిద్ర లేపు
నీ స్థిరమైన కళ్ళను పైకెత్తి
దక్షిణం నుండి దక్షిణం వరకూ
చూపులు సారించు
సూర్యోదయం నుండి సూర్యోదయం వరకూ
పాటలు పాడే నీ పెదవులతో కలలు కను

నాకు నీ చిరునవ్వులూ వద్దు
బలహీనంగా కార్చే నీ కన్నీరు వద్దు
నా మరణానందాల వారసత్వం నాకు వద్దే వద్దు
నన్ను పేరు పెట్టి పిలువవద్దు
నేను లేను
ఒక ఇంటిలో నివసించినట్లుగా
నేను లేనితనంలో జీవించు

మనిషి లేకపోవడం అనేది
ఒక విశాలమైన సౌధం వంటిది
దాని ప్రాకారాల గుండా సాగిపోతూ
నువ్వు గాలిలో చిత్తరువుల్ని వేలాడదీస్తావు

మనిషి లేకపోవడం అనేది
ఒక పారదర్శకమైన గృహం వంటిది
దాని గుండా జీవం లేని నేను
జీవిస్తున్న నిన్ను చూస్తుంటాను

ప్రియతమా!
నువ్వు బాధపడుతూ కన్పిస్తే
నేను మళ్ళొక్కసారి చచ్చిపోతాను *

*(పతంజలి గారి ప్రేమికుల కోసం)*

*(ఆంధ్రజ్యోతి; 23.03.2009)*

భీమ్‌సేన్ దేథే

## పాట

నాన్న రాళ్ళు మోసేవాడు
ఆయన రాళ్ళని మోస్తుంటే
'ఒరే క్రిష్టయ్యా... మంచి పాట పాడరా'
అని మేస్త్రీ అడిగేవాడు

నాన్న గొంతెత్తి పాట పాడేవాడు
ఆయన పాటలో
చందమామ వుండేది
సూర్యుడుండేవాడు
వికసించే పువ్వులుండేవి
సాగర తరంగాలుండేవి
ప్రేమను తాగి మత్తెక్కిన ఆడపిల్లలుండేవారు
చెమట పట్టిన చేతులు చప్పట్లు చరిచేవి
గాలంతా పొగడ్తలతో నిండిపోయేది
మా నాన్న పొంగిపోయేవాడు

పని అయిపోయిన తర్వాత
తానెన్నడూ పాడలేని
ఆకలి పాటను వెతుక్కుంటూ యింటికి తిరిగివచ్చేవాడు *

*(బహుజన కెరటాలు; సెప్టెంబర్, అక్టోబర్ 2011)*

*(భీమ్‌సేన్ దేథే (1947–2017) మరాఠీ దళిత కవి, రచయిత)*

కవితా సిన్హా

## దేవుడితో ఈవ్ సంభాషణ

పైపైకి ఎగసే ప్రతిదీ
పతనం కాక తప్పదని
తెలుసుకున్నది
తొలిసారి నేనే

వెలుతురు లాగా...
చీకటి లాగా...
నీకు లాగా...
తెలుసుకున్నది
తొలిసారి నేనే

నీ ఆజ్ఞలను
శిరసా వహించినా
తిరస్కరించినా
ఒక్కటేనని
తెలుసుకున్నది
తొలిసారి నేనే

తొలిసారి
జ్ఞాన వృక్షాన్ని
స్పృశించిందీ నేనే
ఎర్రని యాపిల్ పండును
రుచి చూసిందీ నేనే

తొలిసారి

వినయానికీ, అవినయానికీ

మధ్యన వ్యత్యాసాలను

తొలిసారి గుర్తించిందీ నేనే

వట్టి రావి ఆకులతో గోడల్ని లేపి

లోకాన్ని సమస్తం

మార్చేసిందీ నేనే

తొలి ఆనందాన్నీ నేనే

తొలి విషాదానికి

సాంత్వన చేకూర్చిందీ

నా శరీరమే

నీ పసి ముఖాన్ని

తొట్ట తొలిసారి

చూసిందీ నేనే

విషాదానందాల నడుమ

ముందుగా నేనే

జీవితాన్ని అసాధారణం చేసిన

మంచి, చెడుల్నీ

బాధల్నీ, సంతోషాల్నీ

తొలిసారి తెలుసుకొన్నదీ నేనే

విలాసవంతమైన

సుఖాల బంగారు సంకెళ్ళను

తొలిగా పటాపంచలు చేసిందీ నేనే

నేనెప్పుడూ

నీ రాగాలకు

కీలుబొమ్మనై నాట్యమాడలేదు

బలహీనుడు ఆదాం లాగా...

నీ భూమిపైన

తొలి తిరుగుబాటును నేనే

విను ప్రియతమా!

నా బానిసా...

స్వర్గం నుండి బహిష్కృత *

*(ఆంగ్లానువాదం: సుభాష్ సాహా; 'దారులేసిన అక్షరాలు' ఇరవయ్యవ శతాబ్దపు భారతీయ మహిళల రచనలు, 2014 నుంచి. సూశీ తారు, కె.లలిత సంపాదకత్వంలో అన్వేషి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురించిన ఈ పుస్తకం వెలువడక ముందే ప్రసాద్ కనుమూశాడు)*

*(కబితా సిన్హా (1931–1998) బెంగాలీ స్త్రీవాద రచయిత్రి, కవయిత్రి)*

కబితా సిన్హా

## దేహం

నీకేం కావాలి?
అదుగో అక్కడ నిలబడి వున్నదొక మంత్రగత్తె
చూడు
ఒక్కటే శరీరం
మంత్రదండం
స్వర్గవృక్షం
మంత్రదండానికి మించిపోయిన
ఒక్కటే శరీరం
ఆహ్వానిస్తూ, అనాహ్వానిస్తూ...

ఆమె శరీరం నుండి నీకేం కావాలి?
మాంసం కావాలా? కొవ్వు కావాలా?
ఒక పురాతనమైన అగ్నిజ్వాలా?
మాంసం కాలిన కమురు వాసనా?
రక్తం సారా? గోళ్ళు, పళ్ళు, వెంట్రుకలు
అన్నం పాత్ర లాంటి దేవత పుర్రె కావాలా?
ఏం కావాలి నీకు?
ఆమె ప్రేమనూ, ప్రతిభనూ కలగలిపి
సారాన్ని పిండుకొంటావా?
లేదా గారడీవాడు టోపీ నుండి
లక్షల లక్షల తెల్లపిట్టల్ని ఎగరేసినట్లు

ఆమె శరీరాన్ని ఒడిసి పట్టి
వందల వేల బిడ్డల్ని తీస్తావా?

ఏం కావాలంటే అది తీసుకో
అదిగో ఆమె అక్కడ నిలబడి వున్నది
అగ్నిధారలా ధగధగ మెరిసిపోయే మంత్రగత్తె
చేతుల్ని గాలిలోకి విచిత్రంగా ఊపుతూ
అదుగో ఆమె అక్కడే నిలబడి వున్నది...
ఆమె కావాలని అడిగితే
ఆమె శరీరం నుండి అత్యద్భుతాలను
వెలికితీయగల వారెవ్వరు?

ఆమె అరచేతుల్లో మత్స్య పద్మహారిణి ముద్రలు
లయలను సృష్టించే ఆమె పాదాలు
గుహల గోడలపైన మార్మిక లిపులను చిత్రించే
ఆమె వేళ్ళ మధ్యన కుంచె
తీసుకో ఏం కావాలంటే అది తీసుకో

అయినా... శరీరమున్నంత వరకూ
ఆమె చేసే తెలివైన విన్యాసం
చిట్టచివరి విన్యాసం... ఒకటుంది!
నీకు కావలసినవన్నీ ఇచ్చేసిన తర్వాత
ఒక రహస్య ప్రదేశం
ఒక రహస్య పుట్టుమచ్చ
ఒక జ్వలించే సందేహం
ఆమె లోలోపల పురుడు పోసుకొంటుంది *

*(ఆంగ్లానువాదం: సుభాష్ సాహా; 'దారులేసిన అక్షరాలు' నుంచి)*

కవితా సిన్హా

## మహాశ్వేతాదేవి కోసం

మహా విధ్వంసక అగ్ని...
అంతిమ ఛాయ ఎలా ఉంటుంది?
నెత్తుటిపైన నీడలా కదిలే నారింజ రంగు కాదు
మెరిసే నారపూల పసుపురంగు కాదు
కలకత్తా కాళిక నాలిక లాంటి
భయానకమైన రక్తవర్ణం కాదు
సిందూరం కాదు బంగారు రంగు కాదు
సకలం దగ్ధం చేసే అగ్నిజ్వాలల అంతిమ ఛాయ తెలుపు!

భయద అగ్నికీలల్ని స్పృశించే సాహసి ఎవ్వరు?
అక్కడ అగ్నికి ఏ అలజడీ లేదు
పాలిపోయినతనంలో మరో పాలిపోయినతనం
కొలమానాలకు అందనంత ఉష్ణ తీవ్రత
నువ్వేమో బుట్టలోంచి ఒక్కొటొక్కటిగా
బంగారు కణికల్ని వెలికి తీస్తున్నావు
అక్కడే నీ ప్రశాంత కుటీరం
ధర్మార్థ కామ మోక్షాలను వదిలి
అక్కడికి ఏ స్త్రీ అయినా ఎలా రాగలదు?
ఈ అపార్థాల ప్రపంచంలోకి
మూడు వందల సంవత్సరాలు ముందే
ఎందుకొచ్చావు నువ్వు? *

*(ఆంగ్లానువాదం: ఎనాక్షి ఛటర్జీ, కరోలిన్ రైట్; 'దారులేసిన అక్షరాలు' నుంచి)*

# ఒక జనన సందేహం

సృజన: ఎల్. ఎస్. రోకాడే
అనుసృజన: కలేకూరి ప్రసాద్

నన్ను కనేటప్పుడు
దుర్భరమైన ప్రసవ వేదనను
అనుభవించానని చెప్పేదానివి
అంతేకాని పురుటి నొప్పులు
నీకెందుకొచ్చాయో తెలుసా అమ్మా?

నీ కడుపులో ఉండగానే
నేను ఆలోచనలో పడ్డాను
ఈ గడ్డమీద
నేనసలు పుట్టాలా వద్దా అని
సందేహిస్తూనే గడిపాను

క్షితిజాంతరాల్లోకి దూసుకుపోయే రాకెట్లు
నా కోసం నిషిద్ధాలయ్యాయి
మీరంతా ఆకాశం వైపు చూపులు సారించి
ఆకాశానికి ఆధారముందని
కళ్ళు మూసుకు చెప్తారు

తరతరాల దారిద్ర్యాన్ని యిప్పటిగా
కప్పుకొని
నిరంతర అవసరాన్ని
బలవింయగా చూసుకొని
రాత్రివేళ నువ్వు నిద్రపోయావు



# స్మృతి కవితలు

## యువక

అతని వెంట ఎప్పుడూ ఓ పులి వుండేది
కొన్ని సార్లు అతనే పులి...
మెత్తగా... మత్తుగా... గమ్మత్తుగా

అప్పుడప్పుడూ నేస్తులకి
సింహపు కూనలని బహూకరిస్తుండేవాడు
లేదా
వారినే సింహాలుగా మార్చేవాడు

పిడికిలికి తల, కాళ్ళూ, చేతులు మొలిచినట్లు
నిటారుగా నిబ్బరంగా ఉండేవాడు
అతను దగ్గరుంటే కొండ దగ్గరున్నట్టే

కొన్ని మాటలు చెబుతున్నప్పుడు
కొత్త మాటలు పుడుతున్నప్పుడు
అంతెత్తు ఉండేవాడు
ఏడో ఎనిమిదో అడుగులు... అంతకన్నా ఎత్తో...
తలెత్తి చూడాలంటే మెడలు నొప్పెట్టేవి

మనిషి పాటగా మారే
మనోహర దృశ్యాన్ని
చూసుంటారా ఒక్కసారైనా మీరు?

చేతిలో అక్షరాలు... కంట నక్షత్రాలు...
పిలిచాడో వశీకరణమే...

వానలా వచ్చి... కురిసి పోయేవాడు
ఉండమంటే ఉంటుందా వాన
ఎప్పటికీ కురుస్తూనే...

చంటి పాపడూ అతడే
పరమ ఛండాలుడూ అతడే...
కొన్నిసార్లు శాంతవదనుడు...
ఇంకొన్ని సార్లు అశాంతవదనుడు

అతను గాలినీ... గాలిని అతను
ఏకకాలంలో శ్వాసిస్తూ, ధ్యానిస్తూ, లాలిస్తూ
ఉండేవాడొకప్పుడు
లేనేలేడిప్పుడు

అతనే జానపద కళా రవీ పవీ కవీ...

అద్దిరబన్నా నా ముద్దుల కన్నా...
నమ్మాలని లేదా
అయితే నా కంటితో చూడు... *

– ఒమ్మి రమేష్ బాబు

# మిస్సింగ్

లోకాన వాంఛలెరుగక
కలయ తిరిగాడు బైరాగిలా

గుంపుల్లో పిపాసిలా
ఏకాకితనాల అంచులలో ధ్యానిలా

తీవ్ర మోహలేమి వీధుల్లో నడివయసు గణికలా
తీరని కలల మలుపు దారుల్లో వైకల్య బాటసారిలా

ఘోరమైన దాష్టీక రాత్రిళ్ళలో
గూడు ఎరుక మరచిన గువ్వలా

పటాటోప దైనందినాల్లో
అంధభిక్షువులా అలుపెరుగక తిరుగాడాడు
అతనే
ఒఖడిగా/వొంటరిగా/ద్రిమ్మరిగా/
సంచారిలా/అనామకుడిలా
అనాది ప్రేతంలా

మరేం పర్వాలేదు
ఈ హీనచరితుడిని
గుర్తించవచ్చు తేలికగా

తొలి మలి సంజెల్లో
సుదీర్ఘ సంతకం సలిపే
ఛాయే ఆతని ఆనవాలు *

To Yuvaka
– అనంతు

# స్మరణీయుడు

పరిమళాల్ని మిగిల్చి
పువ్వు నేలరాలిపోయినట్లు
తూలికలను రాల్చి
రాయంచ ఆకాశానికి ఎగిరిపోయినట్లు
కలేకూరి ప్రసాద్ వెళ్ళిపోయాడు

వెళుతూ వెళుతూ
గూడు కట్టుకుంటూ వస్తున్న జ్ఞాపకాల తేనెపట్టుమీద
మరణం రాయిని విసిరి మరీ వెళ్ళిపోయాడు

ప్రసాద్ జీవితం ఎప్పుడూ తెరిచిన పుస్తకమే
అందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే
ఏం రాసినా గొప్ప నిబద్ధతతో
మరింత గొప్ప ప్రేమతో రాశాడు

భారతీయ దళిత సాహిత్యంలో
కలేకూరితో పోల్చదగిన ఒకే ఒక్క కవి
మరాఠీ దళిత వాగ్గేయకారుడు
విలాస్ గోగ్రే మాత్రమే... *

– సీతారాం





కలేకూరి ప్రసాద్

## కలేకూరి ప్రసాద్ పుస్తకాల జాబితా

### స్వీయ రచనలు

1. దళిత సాహిత్యం (దళిత స్త్రీ సాహిత్య పరిషత్, 1993)
2. దళిత కిరణాలు (లోకాయుత, 1996)
3. దళిత ఉద్యమం–దళిత సాహిత్యోద్యమం (1999)
4. దళిత మానవహక్కుల నిఘా–2000;
   (ఖాజా, గెడ్డం ఝాన్సీలతో కలిసి)
   (ఆంధ్రప్రదేశ్‌లో అంటరానితనం, దళితులపై దాడుల గురించి అధ్యయనం కోసం ఏర్పాటు చేసిన జస్టిస్ పున్నయ్య కమిషన్‌కి సమర్పించిన నివేదిక, సాక్షి హ్యూమన్ రైట్స్ వాచ్ ప్రచురణ)
5. ఆంధ్రప్రదేశ్ దళితులు (ప్రజాశక్తి, 2003)
6. పిడికెడు ఆత్మగౌరవం కోసం
   (బహుజన కెరటాలు ప్రచురణ, 2012)
7. అంటరాని ప్రేమ (మాల మహాసభ ప్రచురణ, 2012)

### అనువాదాలు

హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ

1. మహాశ్వేతాదేవి కథలు 'ఛోళీకే పీచే', 'పాలతల్లి' (1997)
2. మహాశ్వేతాదేవి కథ 'రుదాలి', అంజుం కత్యాల్
   'రుదాలి–జీవన పరిణామ చిత్రణ' (1998)
3. అరుంధతీ రాయ్ 'ఊహలు సైతం అంతమయ్యే వేళ' (1998)
4. స్వామి ధర్మతీర్థ 'హిందూ సామ్రాజ్యవాద చరిత్ర' (1998)
5. వందన సోనాళ్‌కర్ 'జెండర్ రాజకీయాలు–చర్చనీయాంశాలు'
   (కె.సజయతో కలిసి, 1999)
6. డాక్టర్ అమితావ ముఖర్జీ, వందనా శివ, ఉత్సా పట్నాయక్, దేవీందర్ శర్మ 'తిండి గింజలకు తిలోదకాలు' (1999)
7. కె.ఎస్.చలం 'ఆర్థిక సంస్కరణలు – సంక్షేమాలకు అందని ప్రజలు' (1999)

8. కృష్ణకుమార్ 'చదువు చర్చ'
(సహవాసి, ప్రభాకర్ మందారలతో కలిసి, 1999)
9. పి.సాయినాథ్ 'ప్రసార సాధనాలు–పీడిత ప్రజలు' (1999)
10. కిశోర్ శాంతాబాయి కాళే ఆత్మకథ 'ఎదురీత' (2001)
11. ప్రీమొ లెవి 'ఖైదీ నెం. 174517' (2003)
12. బషీర్ కథలు 'అవని తల్లికి అసలైన వారసులు',
'అనల్ హఖ్' (2009)

ప్రజాశక్తి బుక్ హౌస్ ప్రచురణ

1. జాన్ హెూల్ట్ 'పిల్లలు ఎలా నేర్చుకుంటారు?'
(వి.శ్రీహరి, సుంకర రామచంద్రరావులతో కలిసి, 2002)
2. ఏ.జి.నూరానీ 'ఇస్లాం–జిహాద్' (2003)
3. చేగువేరా రచనలు 'విప్లవం–రాజకీయాలు'
(సఫ్దర్ అహ్మద్, గుడిపూడి విజయరావులతో కలిసి, 2004)

ఇతర ప్రచురణలు

1. స్మిత నరూలా 'దళితులు' భారతదేశపు అంటరానివారిపై జరిగే కులహింస (సాక్షి హ్యూమన్‌రైట్స్ వాచ్ నివేదిక, అనువాదం, 1999)
2. భోపాల్ డాక్యుమెంట్–డిక్లరేషన్ (దళితుల 21వ శతాబ్దపు కొత్త ఆశలు, మధ్యప్రదేశ్ ప్రభుత్వం ప్రచురణ, అనువాదం, 2002)
3. గెయిల్ ఆంవెత్ 'మహాత్మా జోతీరావు పూలే–భారత సామాజిక విప్లవ సిద్ధాంతం' (అంబేద్కర్ ఆలోచన అధ్యయన సమితి ప్రచురణ, అనువాదం, 2004)
4. సామాజిక ప్రజాస్వామ్యం దిశగా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం
(బహుజన కెరటాలు ప్రచురణ, అనువాదం, 2008)
5. ప్రొఫెసర్ రాజశేఖరయ్య 'అంబేద్కర్ సిద్ధాంతం'
(అంబేద్కర్ ఆలోచన అధ్యయన సమితి ప్రచురణ, అనువాదం)
6. ఎవరికీ తలవంచని నేటితరం హీరో
(బహుజన కెరటాలు, కలేకూరి ప్రసాద్ స్మృతి సంచిక, 2013)

*(ఈ జాబితా అసమగ్రం)*

కలేకూరి ప్రసాద్ కవిత్వం పట్ల అనురక్తితో ప్రేమలేఖ
ప్రచురణ తరఫున తెలుగు సారస్వతానికి ఈ 'అంటరాని
ప్రేమ'ని కానుక చేసిన శ్రీశ్రీ విశ్వేశ్వరరావు గారికి;

ముఖపత్రకారుడు రమణజీవి,
రేఖా చిత్రకారుడు అన్వర్ గార్లకు;

కలేకూరి ప్రసాద్
(అలియాస్ కోటేశు, సంఘమిత్ర, యువక, కవన)
స్వీయ, అనువాద కవితల్ని తొలిసారి ప్రచురించిన
అరుణతార, ఆంధ్రజ్యోతి, వార్త, ఏకలవ్య, బహుజన
కెరటాలు పత్రికల సంపాదకులకు; చలపతి విజయ
వర్ధనం, కావడి కుండలు, నువ్వే లేకపోతే, దారులేసిన
అక్షరాలు సంకలన కర్తలకు;

కవితల సేకరణలో సహకరించిన మిత్రులు
అరసవిల్లి కృష్ణ, పల్నాటి శ్రీరాములు, తంగిరాల సోని,
చప్పిడి కోటేశ్వరరావు గార్లకు;

పుస్తకాల జాబితాని కూర్చడంలో నేను సంప్రదించిన
మిత్రులు జంగా గౌతమ్, దుర్గం సుబ్బారావు, వినోదిని,
ఖాజా, నూకతోటి రవికుమార్, పి. కేశవ కుమార్,
గుర్రం సీతారాములు, కోయి కోటేశ్వరరావు, లెల్లె
సురేష్, అమర్తలూరి రత్నప్రసాద్, ఆకుమర్తి రవి,
గీతారామస్వామి, ప్రజాశక్తి లక్ష్మయ్య గార్లకు కృతజ్ఞతలు.

antaraani prema
poetry by
kalekuri prasad



నేను జన సమూహాల గాయాన్ని
గాయాల సమూహాన్ని
తరతరాలుగా స్వతంత్రదేశంలో అస్వతంత్రుణ్ణి
అవమానాలకూ, అత్యాచారాలకూ
మానభంగాలకూ, చిత్రహింసలకు గురై
పిడికెడు ఆత్మగౌరవం కోసం తలెత్తినవాణ్ణి
ధనమదాంధ కులోన్మత్తుల రాజ్యంలో
బతకడమే ఒక నిరసనగా బతుకుతున్నవాణ్ణి
బతికేందుకు పదేపదే చస్తున్నవాణ్ణి
నన్ను బాధితుడని పిలువకండి
నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి!

ప్రేమ లేఖ ప్రచురణ